


జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# హెచ్చరిక



మన దేశంలోని పార్టీలు ఏవైనా జాతీయ శ్రేయోపురోభివృద్ధుల నుద్దేశించి సమైక్య భారత దేశమునకు భిన్నముగా వ్యవహరించినచో అవి ఆత్మవిధ్వంసకమునకు పూనుకున్నవే కాగలవు. ఆత్మరక్షణకేమి, ఆర్థికపటిష్టతకేమి, శాంతిభద్రతలకేమి సమైక్య భారత దేశము చిరస్థాయిగా వర్ధిల్లాలి.

మన దేశం రెండుముక్కలై, పాకిస్తాన్ విడిపోయిన ఫలితంగా ఏర్పడిన పరిస్థితులు, పరిణామాలు, భారతపాకిస్తాన్‌ల అభ్యుదయ పురోభివృద్ధులకు ఎప్పటికప్పుడు అడ్డుపడుతూనేయున్నవి. ఉభయ దేశప్రజలు సోదరతుల్యులైనా పరస్పర సద్భావ సాన్నిహిత్యాలకు దూరమై అనేక జాతీయ అంతర్జాతీయ సమస్యల పరిష్కారానికి విదేశాల సహాయము నర్థించవలసి ఏర్పడుచున్నది. దాని ఫలితంగా విదేశీయుల జోక్యం మన ఆత్మరక్షణలాంటి సమస్యలను క్లిష్టము చేయుచున్నది.

ఈనాడు ద్రవిడమున్నేట్రకజగంవారు మన దక్షిణ భారతదేశాన్ని ఉత్తర హిందూస్థానీయుల ఆధిపత్యమునుండి రక్షించుటకు దక్షిణ రాష్ట్రాలు విడిపోయి స్వతంత్ర రాజ్యంగా ఏర్పడాలనే నినాదం జాతీయశ్రేయస్సుకుగానీ, దక్షిణ భారతం యొక్క శ్రేయస్సుకుగాని తోడ్పడజాలవు. సమైక్యదేశానికుండు ఆర్థికస్తోమతుగాని, ఆత్మరక్షణకుగల అవకాశములుగానియుండవు. దేనికది విడిపోవడంవలన అన్నివిధాల నిర్వీర్యమయ్యే పరిస్థితులు, పొరుగుదేశాల దయాదాక్షిణ్యాలమీద నాధారపడవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది. అంతరంగికంగా సయితము శాంతిభద్రతలు లోపించగలవు.

ఇండియా రాజ్యాంగదేశం మొత్తమునకు సమానావకాశములు, హక్కులు సమకూర్చినది. పార్లమెంటరీ విధానంలో మన లోటుపాట్లను, అసంతృప్తిని పోగొట్టుకోడానికి అవకాశమున్నది. ఈ పరిస్థితులలో దక్షిణ భారతదేశం ఉత్తరదేశంవారి ఆధిపత్యంక్రింద నలిగిపోతున్నదనో, అన్యాయానికి గురియగుతున్నదనో అనడానికి అవకాశములు లేవు.

గత చరిత్రను పరజూచినచో విభక్త భారతదేశం ఏనాడును జాతీయ శ్రేయస్సును ప్రోత్సహించలేదని తెలియగలదు. ప్రజలకు సుస్థిరమైన శాంతి సౌభాగ్యములు కావాలంటే సమైక్య భారతదేశము పరిరక్షింపబడాలి.

నియమబద్ధమైన జాతీయవిధానము, నిర్మాణాత్మకమైన కార్యక్రమములేని పార్టీలవలన ప్రజాశ్రేయస్సు రూపొందింపబడజాలదని కాంగ్రెస్ అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధీ తమిళ ప్రజానీకము నుద్దేశించి చేసిన హెచ్చరిక గమనించతగినది. దేశ విచ్ఛిత్తి అన్నివిధాల అనర్థదాయకమని ప్రజలు గుర్తించి జాగ్రత్తపడాలి?

—o—

## వ్యభిచారము - పోలీసులు

వ్యభిచారిణుల మనస్సుమార్చటంలో పోలీసు ఉద్యోగి కృతకృత్యుడైనట్లు హైదరాబాద్ వార్త హర్షించతగినదే. అయితే వ్యభిచారమునకు కారణములను దర్యాప్తుచేయడంలో వ్యభిచారిణులనే కాకుండా, వ్యభిచారులనుకూడ విచారించాలి. తమ విలాసమునకని నీతి నియమాలనుతప్పి విటులు వ్యభిచారమునకు బయలుదేరితే, పొట్టపోసుకోడానికని ఒళ్లునమ్ముకొని జీవిస్తున్నారు వ్యభిచారిణులు.

వ్యభిచారంవల్ల దుష్ఫలితాలు అనేకం. మృగాలకంటె మెరుగైన నియమబద్ధమైన జీవితానికి అలవడాలంటే వ్యభిచారమును మానుకోవాలి. స్త్రీలు కూడుగుడ్డల నుద్దేశించి వ్యభిచారమును వృత్తిగా స్వీకరించారంటే వారి కట్టి దైన్యావస్థకు కారణములను పరిశీలించి ఉద్ధరించవలసియున్నది. వ్యభిచారమున కవకాశములు లేకుండా చేయు సందర్భమున స్త్రీ పురుషులిద్దరిని అదుపులోనుంచి వారిని మంచిమార్గంలోకి త్రిప్పాలి.

—(o)—

# పరిణామము

**శ్రీ గాదేపల్లి శంకరం**

(గతసంచిక తరువాయి)

మూడవ రంగము

**ప్రదేశం: పోలింగుస్టేషను.**

**ప్రవేశం: పోలీసులు- పోలింగు ఆఫీసరు- ఒకప్రక్క వలంటీర్లు బారులుతీర్చి నిల్చుంటారు- వారివెనుక మూర్తిగారుంటారు- ఇంకోప్రక్క జమీందారు- ఆయన అనుచరులు ఉంటారు. కాంగ్రెసు వలంటీర్లు- "వోట్ ఫర్ కాంగ్రెస్" అంటూఉండగా తెరలేస్తుంది తెరలేచాక కొద్దిసేపటికి ఈ నినాదాలు ఆపివేయాలి.**

జ.కొ:-సుబ్బన్నతాతా-ఇలా లోపలికివెళ్ళి-రంగు పెట్టె ఉంటుంది. అందులో వెయ్యి-జ్ఞాపకం ఉంటుందా-మరిచిపోతావా?

సు.తాత:-లేదండి లేదండి (అని వెడుతూండగా)

వలంటీరు:-సుబ్బన్నతాతా! మామాట మరిచిపోయావా? పసుపుపెట్టె పరాకుపడకు సుమా?

సు.తాత:-అలాగేనండి అలాగేనండి (అంటూ పోలింగు ఆఫీసరుని సమీపిస్తాడు.)

పో.ఆ:-నీపేరేమిటి?

సు.తా:-నాపేరెందుకు బాబూ?

పో.ఆ:-లిష్టుచూసి-నీకు ఓటుందోలేదో చెప్పాలి.

సు.తా:-ఉన్నదనే చెప్పారు కాదండీ!

పో.ఆ:-నేను వెరీఫై చేసుకోవాలి-పేరుచెప్పు

సు.తా:-ఈ వెర్రిపిలతోపాటు-నాకు యెర్రెత్తి పోతా ఉందండిబాబూ-బేగి అదేటో ఇచ్చుకొని వేగిరం-పంపించండి-దరమరాజా-

పో.ఆ:-అదికాదయ్యా తాతా-నీపేరుచెప్పితే నీకు ఓటున్నదీ లేనిదీ చూసిచెప్పతాను పేరుచెప్పు-

సు.తా:-సుబ్బన్ననుకోండి.

పో.ఆ:-అనుకోవడమేమిటయ్యా!

సు.తా:-అదేనండి.

పో.ఆ: (లిష్టుచూసి) సరే ఇదిగో ఈకాగితం తీసుకొని-ఆ తడకలగదిలో-కొన్నిరంగు పెట్టెలున్నాయి-పైన ఈకాగితం వేసేదానికి కన్నం ఉంటుంది-ఏదో నీయిష్టము వచ్చినదాంట్లో-ఒక్కదాంట్లో వేసేసిరా-

సు.తా:-బాబయ్యా! అతనికేత్తే ఈరికికోపం,ఈరికేత్తే ఆరికికోపం-సచ్చే సావొచ్చింది మారాజా-యీరికో ఓరికి తమరే యేసేసికుని రక్షించండి బాబయ్యా (అని అక్కడే పెట్టివెళ్ళిపోతాడు)

పో.ఆ:-దిస్ ఈజ్ ఇన్‌వేలిడ్ (ఓట్లు లెక్కపెట్టి) 9972 ఓట్లుతో శ్రీమూర్తిగారు గెలిచారు-

(వలంటీర్లు జయజయ ధ్వానాలుచేస్తూ మూర్తిగారికి దండలువేసి జండాపట్టుకు వెళ్ళిపోతారు- జమీందారు సుబ్బన్నతాత నిలబడిపోతారు- తక్కుతూ తారుతూ సెట్టి నెమ్మదిగా జమీందారుని సమీపించి)

సెట్టి:-అయిందేదో అయిందిలెండి - విచారించకండి బాబూ-మాయిదారిముండాకొడుకులు - మనడబ్బుతిని మనకే నామంవేసేశారు - కానీండి - మరొక్క పదివేలు మనవికావంటే మహానుభావుగా అయిపోయేదేమో బాబూ.

జ.కొ:-అఘోరించలేకపోయావు-మరొక్క పదివేలట-పదివేలు-50 వేలని ఒకసారి-50 వేలని మరోసారి-ఓటుకి 5 చాలని ఓమాటు-10 అయితేగాని లాభంలేదని మరోమాటు అన్నావు. అంతా అయిన తరువాత-ఇంకా పదివేలుంటే-అయిపోయేదంటున్నావా? చాలుచాలు - ఎవడూ నోటితో నవ్వడు-ఏమొహంపెట్టుకొని పరామర్శించవచ్చావు? డిపాజిట్ కూడాపోయిందే- నీబోటిగాళ్ళ ఓటైనా పడిందోలేదో!

సెట్టి: ఏమిచెప్పను బాబూ! ఏమిచెప్పను? అందరూ కాంగ్రెసు కాంగ్రెస్సని ఒకటేగోలపెట్టేశారు కాదండీ - ఏమైనా తోచనిచ్చారా బాబూ! అందరూ ఆరికేయేస్తుంటే- నేనేస్తేమాత్రం లాభమేటండీ-

జ.కొ.-ఏడవలేకపోయ్యావు?

సెట్టి:-ఇప్పుడలాగే వుందండి మరి.

జ.కొ:-ఎంతమోసం చేశారయ్యా?

సెట్టి:-బాబూ-కోపగించొద్దు - ఒక్క మనవి చిత్తగించండి-ఇది తెలుసుండి-చేసినమోసముంటారా?

జ. కో:-ఏమో. ఎవడికి తెలుసు?

సెట్టి:-ఒక్క నాటికి కాదు - ఈళ్ళకి ఏమి తెలుసండి బాబూ. ఓటుఅంటే ఏటో. ఎవళ్ళకేస్తున్నామో! ఎందుకేస్తున్నామో అనే ఆలోచనుండే చేశారా? వేలం వెర్రిబాబూ వేలం వెర్రి - కాకిముక్కు కాదు టండీ యేసెయ్యి కాంగ్రెస్సువాళ్ళ కేసెయ్యి అంటే యేసేశారు - ఆకేశారని ఈరు - ఈకేశారని ఆరూ - అంతబూ అరికేయేసేశారు,

జ. కో:-నువ్వు మాత్రం యేంచేశావు?

సెట్టి:-ఆరూ ఈరూ యేస్తుంటే. నేనూ అరికే యేశానండి మరి.

జ. కో:-మహా గొప్పపనిచేశావు - యిక చాల్లే డొక్క శుద్ధిలేని వాళ్ళతో పని యిలాగే వుంటుంది (వెడుతాడు)

సెట్టి:-అద్గదీ - అదీ భేషైనమాట - ముందు మాకు డొక్కశుద్ధి చేయించండి మారాజా. అన్నీ సర్దుకుంటాయి. (తెర)

ప్రదేశము: మద్రాసులో ఒకవీధి-ఆగష్టు 15 (1947)

ప్రవేశము: ఉన్మత్తుడు.

[తెరలో పాట ... ...
"స్వాతంత్ర్యరథం స్వాతంత్ర్యరథం
అదిగదిగో అదే అదే"]

గండాలుగడిచి పిండాలు బయటపడేసరికి బ్రహ్మాండాలు బ్రద్దలయ్యాయి - ఆడపిల్లా? మగపిల్లా? అదీ కాదు ఇదీకాదు కవల పిల్లలు - వహ్వా - వహ్వా ఏమి ఆనందం? ఏమి అలంకారాలు - మీసాల పెండ్లివారు ఈ పందిట్లోనూ - గడ్డాల పెండ్లివారు ఆపందిట్లోనూనా? బాగుంది. బాగుంది మహా బాగావుంది. భేషుగ్గావుంది.

ఆహా సృష్టివైపరీత్యం - ఓనాడు పీకిపారేసిన, త్రివర్ణపతాకాలు - పోలీసుల తలలమీద, ఫోర్టుసెంటు జార్జికోటమీదాకూడ తాండవిస్తున్నాయిగా! కాలచక్రం కార్పొరేషను భవనంమీద - గిర్రున తిరిగిపోతోందే! అందరూ అటువైపే తుర్రున పరుగెడుతున్నారు. ఆగష్టు పదిహేను మహాహడావుడిగా వుంది. అబ్బ! ఏమి జనంరా బాబూ - నేల ఈనింది కాబోలు - హారినాయిల్లు బంగారంగాను! ముసలి ముండావాణ్ణి నన్ను తొక్కేయ్యరుగదా?

మొదటి ధమధమాలో నమ్మించి స్వామిద్రోహం చేసిన ముండావాళ్లు - పంజాబులో దయ్యాలచేత పాతాలుచేయిస్తే - ఉప్పు సత్యాగ్రహంలో ఉగ్ర నరసింహస్వరూపందాల్చి - రెండవ ధాంధూంనాటికి ఉప్పు సత్యాగ్రహంలో - ప్రభుత్వభవనాలు - తంతితపాలాలు - రైలుపట్టాలు - పప్పు పప్పఅయినాయి - అహ్హహ్హహా - డాంతో ఢింఖాలుకొట్టిన బ్రిటిషు ప్రభుత్వం - దాసోహం మహా ప్రభో అనవలసివచ్చింది హీ-హీ-హీ.

ఓ రామకృష్ణా! ఓ వివేకానందా! ఓ తిలక్ మహాశయా! ఓ దాదాభాయినౌరోజీ! బాబూ చిత్తరంజనదాసూ! - నాయనా మోతీలాల్ నెహ్రూజీ - అయ్యా మదనమోహన మాలవ్యా! లాఠీదెబ్బలు తిన్నా లాలా లజపతిరాయి బాబూ! రండి. రండి - వెళ్ళినదకలు సాగించకండయ్యా! రండి రండి త్వరగా రండయ్యా - స్వాతంత్రం వచ్చింది. స్వాతంత్ర్యం - పారతంత్ర్యం పశ్చిమదిక్కుగా అస్తమించింది - బిపిన చంద్రపాలూ - మనమిక భాగ్యశాలులము కాదయ్యా - స్వతంత్ర భారతానికి - స్వతంత్ర భారతపౌరులం - మోతీలాల్ నెహ్రూజీ - మనం నూతన రాజ్యాంగము వ్రాసుకోవాలి - భూమార్గములోనూ - జలమార్గము లోనే కాకుండా - వాయుమార్గములోకూడ - ప్రపంచమంతా అతిసన్నిహితమవుతూవున్న ఈనవయుగంలో - నాటిదేశాలతో సభ్యమానవునివలె - ప్రవర్తించాలి కాదూ! మరి దానికనువుగా వ్రాసుకుందాము - అన్నీ సంస్కరించుకుందాము.

అదిగో! అదిగో! స్వతంత్ర భారతదేశం! అదిగో! అదిగో! స్వతంత్ర భారతపౌరులు - ఓహో! ఓహో! విత్తానికి లోటులేదు. విద్యకు కొదువలేదు. వినోదానికి అంతులేదు. కడుపునిండిన తిండి - వళ్లు నిండినబట్ట - ఉండటానికి ఇల్లు - చేయినిండినపని - వహ్వా వహ్వా - ఇలాచూడండి - ఇలా చూడండి - ఈ స్వయంపోషక గ్రామాలుచూశారా? ఆధునిక సంపత్తితో అన్ని హంగులు అమర్చబడినాయి - ఆ ప్రజలతోడ్పాటు పరికించారా! నీతి నియమం చిత్తగించారా! ధర్మానికి నాల్గుకాళ్లూవచ్చాయి! ధన్యోస్మి! ధన్యోస్మి! రామరాజ్యం! రామరాజ్యం నిత్యకళ్యాణం - పచ్చతోరణంగా ఉంది! కన్నుల వైకుంఠం - బోలో స్వతంత్ర భారత్ కు జై!

(పాట - ... ...
ఓహోహో! ఓహోహో!
నీహారాద్రికి లంకకు నడుమనున్న ప్రజలారా!
వినరారా మీరందరు వినరండి
ఇది నవవసంత దివసోదయ సమయం
ఇది శాంతి సమరసుస్థిర విజయం.

(సశేషము)

# రాజకుమార్

ఫ్రెంచి మూలం:
అంటోని డెసయంట్-ఎక్స్యుపెరీ

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



## దీపాల లోకం!

[ఈ కథానికలో ముఖ్య పాత్ర రాజకుమార్. ఈ అబ్బాయి గ్రహమండలాలలో నొక దానికి చెందినవాడు. ఒక రోజున తెల్లవారిందో లేదో, భూమండలంలో ఎడారి ప్రదేశంలో ఒక పైలట్ ముందర ఈ అబ్బాయి ప్రత్యక్షమయ్యాడు. పైలట్ ప్రపంచాన్నంతా ఎన్నో సార్లు సునాయాసంగా తన విమానంలో చుట్టివచ్చిన మనిషి. దురదృష్టవశాత్తు ఆయన యంత్రం చెడిపోయింది. ఎంతో కష్టంతో ఎడారి మధ్యభాగంలో దిగగలిగాడు. యంత్రాన్ని మరమ్మత్తు చేయటం సులభమైనపని అయితేగా! అలాటి సమయంలో రాజకుమార్ తనదగ్గిర ప్రత్యక్షమవటం- ఎన్నెన్నో కబుర్లు తనకు చెబుతూ వుండటంతో ఆ పైలట్ తన బాధనే పూర్తిగామరచి పోయాడు. ఇలా ఎన్నో రోజులు ఆ ఎడారి ప్రదేశంలోనే వాళ్లిద్దరూ గడిపారు. అలా రాజకుమార్ కబుర్లు చెబుతూ తను వచ్చిన గ్రహమండలాన్నిగురించి, తన మండలానికి చుట్టు ప్రక్కలలోనున్న గ్రహమండలాలని గురించి ఎన్నో వింతవింత సంగతులని పైలట్‌కి వివరించ సాగాడు. వాటిలో ముఖ్యమైన సంగతులు అబ్బాయి ఒక సారి అలాటి నక్షత్ర మండలాలలో చేసిన యాత్రకు సంబంధించినవి. ఇంతవరకు మీరు అబ్బాయి చూసిన నాలుగు మండలాల వివరాలు చదివారు. ఇప్పుడు అయిదో మండలం సంగతి చదువుతారు.]

రాజకుమార్ ఇప్పుడు చూడటానికి వచ్చిన గ్రహమండలం వాడు ఇంతవరకు చూసిన నాలుగు గ్రహమండలాలకన్న ఎంతోచిన్నది. అందులో వున్నది ఒక దీప స్తంభం. దీపాన్ని ముట్టిస్తూ,ముట్టిచ్చిన దానిని చప్పుచప్పున ఆర్పేస్తూవున్న ఒకాయన దీపపు స్తంభం ముందరనే వున్నాడు. చుట్టుప్రక్కలా ఇండ్లు లేవు. మరి ఇతర దృశ్యాలేమీ కనబడటంలేదు. అలాటి చోట్ల ఎందుకిలా స్తంభాన్ని కట్టారో, ఆ దీపపు గొడవనంతా చూసుకోటానికి ఎందుకిలా దీపాలమనిషిని వుంచారో......ఇదే రాజకుమార్‌ని కలవరపెడుతూవున్న గడ్డు సమస్య.

దూరాన్నుంచి ఆ వింతనంతాచూస్తూ, బహుశా దీపం చెడిపోయివుండవచ్చు, దానిని బాగు చేయటానికి ఇలా దీపాన్ని ఆర్పుతూ ముట్టిస్తూ వుంటాడు అనుకున్నాడు అబ్బాయి. దీపాల మనిషిని సమీపిస్తూ, ఆయనకు నమస్కారం చేస్తూ

"ఏమయ్యా! ఎందుకలా ఇప్పుడే ముట్టించిన దీపాన్ని ఆర్పి వేస్తున్నావు?" అని తన సందేహాన్ని తీర్చుకోటానికి అబ్బాయి అడిగాడు.

"అలా చేస్తూవుండాలని నాకు ఆజ్ఞ ఇచ్చారు" అని అంటూ ఆ మనిషి అప్పుడే ఆర్పేసిన దీపాన్ని మరొకసారి గబగబ ముట్టించాడు.

"ఆజ్ఞ! ఇలాటి ఆజ్ఞలను ఎప్పుడూ కనీ వినీ వుండలేదే" ఆశ్చర్యంతో అబ్బాయి అడిగాడు.

"ఇక్కడి దీపాల మనుషులు చేయాలసిన పని ఇదే. ఇదే! తరతరాలనుంచి

వస్తున్న ఆర్డరు'' అంటూ ఆయన తిరిగీ తన పనిలో మునిగి పోయాడు.

''అంటే!'' ఇంకా వివరాలు తెలుసుకోవాలని అబ్బాయి అయన్ని ప్రశ్నించాడు.

''అబ్బాయి! నువ్వు కుర్రవాడివి! ఈ గొడవంతా నీకెలా తెలుస్తుంది! ఆర్డర్ అంటే ఆర్డర్. తు. చ. తప్పకుండా దానిని చేయాలసిన పని నాది. ఇదే నా వృత్తి కూడా'' అని అన్నాడు దీపాల మనిషి అప్పుడే ముట్టించిన వత్తిని ఆర్పేస్తూ. ఈ పని చేయటానికి ఎంత ఓర్పువుండాలి. అతనికి విశ్రాంతి అనేది ఎలా వుంటుంది ఇలా పిచ్చి మనిషికిమల్లె! ఆ గొడవలో మునిగి తేలుతూవుంటే? అలసిపోయి వున్నాడు. మొహమంతా చెమట. దానిని తుడుచుకోలేక తికమకపడిపోతున్నాడు. తిండీ తిప్పలు అనేది ఇలాటి వాళ్లకి వుంటుందో లేదో మరి? ... ఆయనకేసి తదేకంగా చూస్తూ అబ్బాయి ఎంతో బాధపడుతూవున్నాడు. ఆ మనిషికి బాధ అంటే ఏమిటోబాగా తెలిసివుండాలి. అబ్బాయి మనోభావాలని గ్రహించాడు. అబ్బాయి భుజాన్ని ఆప్యాయంగా తడుముతూ

''అబ్బాయి! నాయీ గొడవకోసం ఎందుకలా కలవరపడిపోతావు? పెద్దలు నాకు ఇచ్చిన వృత్తి ఇదంతా. దీన్నంతా చూసుకోలేకపోతే ఎంత అమర్యాదో నీకెలా తెలుస్తుంది పాపం! ఈ రోజులు వేరు. పూర్వపు రోజులు వేరు. ఆ రోజుల్లో ఇంత గొడవ వుండేదికాదు. సూర్యాస్తమయానికి దీపాన్ని ముట్టించటం రాత్రంతా హాయిగా నిద్రపోవటం, తెల్లవారేటప్పటికి నిద్రలేచి దీపాన్ని ఆర్పేసి దినమంతా తనివి తీరా విశ్రాంతి తీసుకోటం. ......'' అని ఏమేమో చెప్పబోతున్నాడు. అబ్బాయి తటుక్కున ఆయన చెప్పేదానికి అడ్డువస్తూ ''అంటే ఆ రోజుల్లో ఇయ్యబడ్డ ఆర్డర్ ఈ రోజుల్లో చాలవరకు మారిందన్న మాటేనా?'' అని ఆతృతతో ప్రశ్నించాడు.

''అసలు ఆర్డర్‌లో ఎలాటి మార్పు లేదు. కాని వాళ్ళనిఅంటే లాభంవుంటుందా మరి. అంతా కాలచక్రపు మహిమ. అప్పుడు ఈ మండలానికివుండే ఇప్పుడువుండే కదలికకు, కదలికకు, ఎంతోమార్పువుంది. ఈమార్పునుచూస్తూ వుంటుంటే నాకే ఆశ్చర్యంవేస్తూవున్నది.'' అని ఆ మనిషి నిట్టూర్పు విడుస్తూఅన్నాడు.

''అంటే?'' విస్తుపోతూ అబ్బాయి ఆయన్ని ప్రశ్నించాడు.

''ఇప్పటి ఈ మండలపు కదలికలో ఈ క్షణంలో పగలు మరోక్షణంలో చీకటి. అలామారిపోయింది ఈ మండలపువేగం. దానికి మనం ఏం చేయగలుగుతాం? దీనితో నడుస్తూ నాపని పాటలని చేసుకోటం నాధర్మంకదూ'' అని అన్నాడు ఆయన.

''ఇలా ఎంత కాలమని?''

''ఆ సంగతి నాకేం తెలుస్తుంది? అంతామాయ - నిజంగా ఇంద్రజాలం! మనం ఇలా మాట్లాడుకుంటూవుండగా లోపునే ఒక నెలఅయింది, నా పూర్వపు

లెక్కలో'' అని నలుప్రక్కలకేసి ఒకసారి చూస్తూ అన్నాడు దీపాలమనిషి.

''ఆ! ఒకనెలఅయిందా'' ఆశ్చర్య పడుతూ అబ్బాయి అన్నాడు.

''ఊ! ఒకనెలేగా! నెలా ముప్పయి నిమిషాలుఅయ్యాయి. కాలచక్రం ఇలా ఇక్కడ వాయువేగ మనోవేగాలతో గిర గిర తిరుగుతూ వుంటుంది. ఇంకా కొంచెం సేపు వుంటివా, రెండు నెలలకు పైగానే అయిపోతుంది...'' అని అంటూ చకచక తన పనిని చేసుకోటంలో అబ్బాయి తన దగ్గర వున్నాడన్న సంగతినే మరచి పోయాడు ఆ మనిషి.

అబ్బాయి దీన్నంతాచూస్తూ విస్తు పోతున్నాడు. అతను చేస్తూవున్నపనిని చూస్తూంటే అతనిమీద జాలివేస్తున్నది అబ్బాయికి. అలసి సొలసివున్నా ఎంత వోపిక! దాన్నంతా మరో పనికి వుపయో గించుకుంటే ఎంత బాగుండేది! ఏవిధంగా సహాయంచేస్తే ఈ గొడవనుంచి ఇతనిని ఒక దరీదాపుకు తీసుకునిరావచ్చు! ఇదే అబ్బాయిలో రేకెత్తిపోతూవున్న ఆలో చనలు. అటు ఆ దీపస్తంభాన్నిచూస్తూ వున్నప్పుడు ఇటూ ఆ మనిషి విధివిరామం లేకుండా ఒకక్షణం వత్తిని వెలిగిస్తూ మరో క్షణంలో దానిని ఆర్పేస్తూవుండటం చూస్తూవున్నప్పుడు...చప్పున అబ్బాయి బుర్రలో ఒక ఆలోచనతట్టింది. తనూ తన గృహమండలంలో అస్తమానమూవుం డటం అంతగా నచ్చిందికాదు. వాడి కోరి కంతా ఎప్పుడూ సూర్యాస్తమయాన్ని చూడాలనే! తన మండలంలో వున్నంత కాలం ఈకోరికి నెరవేరటం కష్టం. అంచేత తనొక కొత్తపద్ధతిని తెలుసుకున్నాడు. తన మండలాన్నే సూర్యాస్తమయం అయ్యే ప్రదేశాలకి బరబర తిప్పుకునివచ్చాడు. ఎంతతమాషాగావుంది ఆలాచేయటం. తనకోరిక యథాతథంగా నెరవేరింది. అలా ఈమనిషికూడా చేస్తేనో? అప్పుడు ఈగొడవంతా ఈయనకుండదుగా!

''ఏమయ్యో!... ఈ కష్టనిష్ఠూరాల నుంచి ఒక దరీదాపుచూపెడితే దానికి ఒప్పుకుంటావా? ..అప్పుడు కావాలసినంత విశ్రాంతి వుంటుంది'' అని అబ్బాయి ఆయన్ని పలకరిస్తూ అన్నాడు.

''అదేమిటో చెప్పు!'' అని అబ్బాయి కేసి ఆదుర్దాతోచూస్తూ అడిగాడు దీపాల మనిషి.

''నీ గ్రహమండలము చాలా చిన్నది. నువ్వు హాయిగా కూచోటానికికూడా అందులో తావులేదు. దీనివేగాన్ని ఎక్కువ చేయటం, తగ్గించటం అంతకష్టమైన పని కాదు. నువ్వే పట్టుపట్టి దాన్నంతా నీ చేతుల్లోకి తీసుకుంటే . తిన్నగా సూర్యుని కేసి నడుపుతూవుండు ఈ మండలాన్ని, అప్పుడు వెలుతురువుంటుంది. ఇక్కడ దీపాన్ని ముట్టించాలసిన గొడవే పూర్తిగా పోతుంది. పగటిపూటనే నీకు ఇష్టంవచ్చి నంతకాలం పొడిగించవచ్చు ఏమంటావు?'' అని అబ్బాయి తన ప్లానుని ఆయనకు వివరించబోయాడు.

పెదవిని విరుస్తూ, ''నువ్వు చెప్పే ప్రకారం చేస్తూవుంటే ఇక నిద్రఎలా పోగలుగుతాను? ఇప్పుడువున్న గొవడ

లోనే వుండిపోనియ్యి. ఇదే ఒకవిధంగా నాకునచ్చింది.'' అంటూ అప్పుడే వెలిగించిన దీపాన్ని ఆర్పేశాడు. మరొకసారి దానిని వెలిగించాడు.

ఈ మనిషి అక్షరాలా పిచ్చి మనిషి. అలాటివాళ్ళకి ఎలాటి సలహాలు ఇచ్చినా ప్రయోజనం వుంటుందా! వాళ్ళపిచ్చే వాళ్లకి నచ్చుతుంది.

మొదటి తారామండలంలో తను చూసినరాజు, రెండో గ్రహామండలంలో తను ఎదుర్కొన్న డాంభాచారి, మూడో మండలంలో తను కలుసుకున్న త్రాగుబోతు, నాలుగో మండలంలో తను పలకరించిన పెద్దమనిషీ ఈ కోవకుచెందిన వాళ్లేగా అని అనుకున్నాడు అబ్బాయి. అలాటి కోవలో పుట్టిపెరిగి, ఆ వాతావరణానికి దాసాను దాసులయిన వాళ్ళని మార్చటానికి ఎవళ్ళ తరమవుతుంది? ఇతర్ల మార్గాలని తెలుసుకోవాలని వాళ్ళకి ఆశవుంది. కాని వాళ్ళ ఆశలు కొనసాగాలంటే వాళ్ళలోకాలన్నుంచి ఒకనిమిషం బయటికి రావాలిగా! అంతసాహసం, అంతత్యాగం వాళ్లకి వుంటేగా.

వాళ్లదంతా ఒకఎత్తు. ఈ దీపాల మనిషిది ఒకఎత్తు. వాళ్లకన్నా ఇతను ఆబ్బాయికి బాగా నచ్చాడు. ఇతను వుండే చోటు అంత పెద్దదికాదు. తనే హాయిగా కూర్చుండటానికే తావులేదు ఇందులో. లాలించి పాలించేవాళ్లు ఎవళ్లూ ఇతనికి కనబడటంలేదు. ఇతను ఎందుకిలా ఇక్కడే, ఈ ఇరుకుచోట వుండిపోయి తికమక పడుతూవుండాలి. తానే కొంతకాలం ఏదో విధంగా ఇతనిదగ్గరే వుండిపోయి, నయాన భయాన తన మార్గంలోకి త్రిప్పుకుంటేనో.

అలాటి ఆలోచనలు మంచివే కాని ఇలాటి స్థలాలు, ఇలాటి స్థలాలలో ఇలా తికమకపడుతూవున్నవాళ్లు మరెంతమంది వున్నారో పాపం! ఈమనిషిదగ్గర వుండిపోవటానికి ముందు, వాళ్లనందరిని ఒకసారి చూసిరావటం మంచిదికదూ అనుకుంటూ అబ్బాయి ఆ మనిషిదగ్గర సెలవు పుచ్చుకొని తిన్నగా ముందుకు బయలుదేరాడు.

—o—



# 'పాపం బ్రద్దలైంది'

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

అప్పుడామె, తనయందూ - తనకుమారుని పోషణ యందూ ఎంతో ప్రేమాభిమానాలు కల్గివున్నాయని నమ్ముతుంది. అప్పుడు యిక మనం కోరకుండానే, ఆ రెండెకరాలూ, ఆకుర్రవాడికి చెందేటట్లు వ్రాసి యిస్తుంది. వాడు మనింట్లోవుంటాడు. ఆపొలం కూడా మనచేతిలోనే వుంచినట్లుంటుంది. వీలైతే కవులుకి నేనే తీసుకొని దున్నుతాను. దానిమీద వచ్చే అయివేజుతో, కొంతడబ్బుని నిల్వ చేయవచ్చు. "నాపొలంమీదవచ్చిన డబ్బేదీ?" అని ఒకవేళ పిన్ని అడిగిందనుకో - మాటవరుస కంటున్నాను_ "మా నాన్నని మోసంచేసి, మీ ఆయన గుంజుకొన్న డబ్బుకి వడ్డీతీసుకొంటున్నాం"_అని నేను సమాధానమిస్తాను. అప్పుడది కేంచేస్తుంది! అందుకని, ఆ పొలాన్ని, ఆ కొడుకు పేరుపెట్టి, దానిమీద అజమాయిషీ మనకిచ్చి, మన చెప్పుచేతల్లో వుండేలాగు చేసుకోవటం ఎందుకైనా మంచిది. లేకపోతే, మన ఆస్తి మనకు, ఎలా తిరిగి వస్తుంది? ఏదో ఒకటి చెయ్యకపోతేనేగాని, యీలోటుతీరదు. అందుకని, ఆ శారదపిన్నిని, కొడుకుతో, సహా వచ్చేలాగు చెయ్యడమే, ముందు ముందు సాగబోయే మన ప్రయత్నానికి లాభసాటియైనపని. ఏమంటావ్?"

దుర్గమ్మ తెల్లబోయింది. కొడుకింత ప్రయోజకుడనుకోలేదు. కొద్దిపాటి చదువు చదివినా, బుద్ధి మాత్రం బృహస్పతికన్నా ఎక్కువగావుందని సంతోషపడింది. సరేఅని తలవూపుతూ లేచి - చరచరా మంటూ, మండువాగుండా నడిచివచ్చి, భర్తముందు నిలబడింది. ధర్మారావు గొడ్లసావిడిలోకెళ్ళి, ఎడ్లకు వరిగడ్డి వేస్తున్నాడు. జయలక్ష్మి మెల్లిగా వాకిట్లోకొచ్చి. ఆరబోసిన ధాన్యాన్ని దగ్గరకు ప్రోగు చేయసాగింది.

అంతవరకూ భార్యకోసం ఎదురుచూసిన జగన్నాథం కుర్చీలోంచిలేచి, _ మెట్లుదిగుతూ - "ఏం చెప్పదల్చుకున్నావే?" - అన్నాడు.

కోడలు జయలక్ష్మి ఎక్కడ వినిపోతుందో అనే భయంతో _ వాకిటరుగులవరకూవచ్చి—

"మీమాటనే నెప్పుడు కాదన్నాను చెప్పండి? ఎవరికైనా కష్టాలువస్తూవుంటాయి. అయినా వాళ్ళం మనబోటివాళ్ళమే ఆదుకోకపోతే. మాతోటి కోడలికి యింకేవరాదిక్కుంటారు? 'నా' అని ఎవరాశ్రయమిస్తారు? పాపం! ఆ చంటివాడు "నాన్నా - నాన్నా" అంటూ ఎంతగా తపించి, ఏడుస్తూవున్నాడో! మీరలాగైనాసరే వాణ్ణి వెంటబెట్టుకొనిరండి! మీరే 'నాన్న'నుకొని, వూరుకోనన్నా వూరుకొంటాడేమో! అయిందేదో అయిపోయింది. గతాన్ని యింకెందుకూ తవ్వుకోవటం? వీలైతే శారదనికూడా, తీసుకొనిరండి. కొన్నాళ్లుండిపోతుంది యింతమందివుండికూడా, దిక్కులేనిదాన్నిగా చేసి. ఒంటరిగా వేడ్పించటం భావ్యంకాదు. మాయదారిలోకం మనల్నే ఆడిపోసుకుంటుంది. కాబట్టి, ఎలాగోలాగు నేచెప్పినట్లు చేసిరండి! శారద ఒకవేళ రానంటుందేమో! వూరుకోకండి. ఎట్లాగైనా, నే చెప్పాననిచెప్పి, ఒప్పించి తీసుకురండి! నాకూ వాళ్ళిద్దర్నీ మనస్ఫూర్తిగా చూడాలనేవుంది. భర్త పోయి ఆదెంత కుమిలి కుమిలి ఏడుస్తోందోపాపం!! చిన్నతనంకూడా ఏమనుకుంటోందో ఏమో" _ అంటూ కళ్ళనీళ్లు పెట్టుకొంది. జగన్నాథం నివ్వెరపోయాడు. 'తన భార్యలో యింతమార్పు ఒక్కసారిగా ఎలా కల్గిందో'నని ఆశ్చర్యచకితుడై పోయాడు. 'తన ఉద్బోధ అక్కరకొచ్చిందని' హృదయాన్ని కుదుటపర్చుకొన్నాడు. ఇక అట్టే సేపు నిల్చుండటం యిష్టంలేక, చేతిలో గొడుగుని, చంకలోపెట్టుకొని రోడ్డెక్కాడు. దుర్గమ్మ వెడుతున్న భర్తవంకచూస్తూ - "తప్పకుండా తీసుకురండీ" - అంది. ఆ మాట, మలుపుతిరుగుతున్న జగన్నాథంకి వినిపించి, ఒక్క చిరునవ్వుని తెప్పించింది.

అప్పటికి ప్రొద్దువాటారబోతోంది. ఆకాశం పొగమబ్బులతో ఆవరించుకొని పోతోంది. జయలక్ష్మి ఆరబోసిన ధాన్యాన్ని బస్తాకెత్తుతోంది. దుర్గమ్మ లోపలికొచ్చేసింది. గంపెడు దుఃఖాన్ని నెత్తికెత్తుకొని జగన్నాథం చేరేటప్పటికి, నారాయణ

రావు అత్తమామలూ - బావ మరదులూ - వీరభద్రం - శారదను ఓదారుస్తూవున్నారు. వెళ్ళీ వెళ్ళంగానే, జగన్నాథంకి మాట పెగల్లేదు. ఎట్లా పరామర్శించాలో, అంతవయస్సువున్నా అర్థం కాలేదు. శారదకు మరింత దుఃఖం పెల్లుబికింది. చంటివాడు 'నాన్నా-నాన్నా' అంటూ వచ్చీ రాని మాటలతో, తల్లి నేడ్పిస్తున్నాడు. ఆమె వాడి ఏడ్పు నిభరించలేక, చేసిన చీకటి పాపాన్ని తల్చుకొంటూ, ఏర్పడిన పరిస్థితికి, కుమిలిపోతూ కళ్ళి, కళ్ళియేడుస్తూవుంది... వీరభద్రం మాత్రం జగన్నాథాన్ని చూసేసరికి వణకిపోయాడు. ఎదురుగా నిలబడలేక, అక్కడక్కడకు తప్పుకు తిరుగుతూ, కలతతో ముఖాన్ని చాటుచేసుకోవటం సాగించాడు. నెలరోజులు గడిచింది. శారద విషయం పరిష్కారానికొచ్చింది. ఎక్కడ వుండి, ఆమె బతుకుని గడపాలనేది ఒకనాడు చర్చనీయాంశమైంది. శారదనుకూడా ప్రశ్నించారు. ఎక్కడవుండి కాలాన్ని వెళ్ళబుచ్చేదీ తెల్పమన్నారు. మొదట్లో ఆమె ఏమీ సమాధానమివ్వలేకపోయింది. జగన్నాథం, తన భావాన్ని వ్యక్తం చేయకముందే, ఆమె తల్లిదండ్రులు, అన్నదమ్ములు, జగన్నాథంతో _ "శారదని కొన్నాళ్ళపాటు మా యింటికి తీసుకొని వెడదామనుకొంటున్నాం... యిక్కడ ఒంటరిగావుంటున్న కొద్దీ, ఆవేదన పడటమేగానీ, యింకేముంది?" _ అని తమ తమ మనోభావాల్ని తెలియపర్చారు. శారదకూడా వెళ్ళాలనుకొంది. జగన్నాథం తన అభిప్రాయాన్ని వెంటనే విరమించుకొని, 'సరే! అలాగే చేయండి'. అని చెప్పి రెండురోజులుండి, తన స్వస్థానానికి చక్కాపోయాడు. తరువాత తరువాత, శారదని తీసుకొని, ఆమె వాళ్లు వెళ్ళిపోయారు. వీరభద్రం వుసూరుమన్నాడు. నారాయణరావు చెప్పినట్లు, యిక కాసేం - చేయగలనని, నిరుత్సాహపడ్డాడు. తన ప్రయత్నం విఫలమైనందుకు చిరాకుపడ్డాడు. తను చూస్తూ - చూస్తూండగానే, శారదయింటికి తాళం పడిందని, కనుబొమలు ముడివేస్తూ, పిడికిలి బిగించాడు. ఎలాగైనాసరే, ఆ తాళాన్ని బద్దలుకొట్టి, తీయించాలని, బిగించిన పిడికిలిని తెరిచాడు. వీరభద్రంకి, నారాయణరావు పోయినందుకు ఏ విచారమూ లేకపోగా, శారద, తప్పుకొని పోయినందుకు విపరీతమైన ద్వేషం కల్గింది. ఎట్లాగైనాసరే శారదను, తిరిగి, చేతుల్లోకి, లాక్కోవాలని, నిర్ధారించుకొన్నాడు.

శారద పుట్టింటివారు మధ్యరకం కుటుంబీకులు. పెద్ద సంసారం. తెల్లవారినదగ్గరనుంచి అధికమైన ఖర్చేగాని, రాబడి బహుతక్కువ. నిశ్చింతంగా కాలం గడపటమనేది ఎన్నడూలేదు. శారద తండ్రి ఒక హైస్కూలు మేస్టరు. స్థిరమైన జీవితాన్ని గడుపుతున్నా, శారద విషయం ఆయనను క్రుంగతీసింది. శారద, వైధవ్యంతో పుట్టింటికొచ్చిందని తెలియడంతో, ఆమె చిన్ననాటి స్నేహితురాలింద్రంతా చూడటానికొచ్చి, కళ్ళనీళ్ళ పెట్టుకొన్నారు. యింత చిన్నవయస్సులోనే యీరాత ఏమిటని?" 'కొందరు విధిని తిట్టిపోశారు. ఎవరుమాత్రం యిప్పుడు చేయగల్గిందేముంది? క్రమక్రమంగా, శారద విషయం ఆవూళ్ళో పాతపడిపోయింది. వీధిముఖం చూడని శారద, మెల్లిగా, యింటిపనులుచేస్తూ, ఎండపొడని చూస్తూవుంది. కుమారుడితో, కాలక్షేపం చేయటం కొంతవరకు గడిచిపోతోంది. తీరికవున్నప్పుడల్లా, భర్తని తల్చుకొని కుమిలి, కుమిలి ఏడుస్తూవుండేది. తల్లిదండ్రులు ధైర్యంనూరిబోస్తూ, ఓదార్చేవాళ్లు. అన్నదమ్ములతోనూ - వదినా మరదళ్ళతోనూ ఎంతసేపు మాట్లాడినా, మనస్సు శాంతంగావుండేదిగాదు. ఏదో తీరనిబాధ హృదయాన్ని కలచివేస్తూండేది, పదేపదే పాతతలపులు గుర్తొచ్చి, మధురస్మృతుల్ని రెచ్చగొట్టేవి. ఏపనిచేద్దామన్నా, వుషారుపుట్టేదిగాదు. వూరికే కూర్చొనివుండటమంటే, అతికష్టమనిపించింది. ఎవరితో ఏం మాట్లాడుదామనుకొన్నా, తన జీవితసంగతులే ప్రస్తావనకొస్తూండేవి. భరించలేనంత ఆవేదన, దుఃఖమూ పొంగుకువచ్చేవి. అందరూ ఓదార్చేవారు. ఏంలాభం? నుదుటికుంకుమ చెరిగిన తరువాత, నూరేళ్ళుబతికినా, ప్రయోజనమేమిటి? శారద విచలిత హృదయంతో, కుర్రవాణ్ణి కౌగిలించుకొనేది. యిట్లా యెంతకాలం గడపాలోనని వున్న రెండునెలలూ శారద తీవ్రంగా యోచించింది. దిక్కుతోచలేదు. వున్నట్టుండి, ఒక్కనాడు, తల్లిదండ్రులతో - "నాకిక్కడేమీ తోచటంలేదు. అక్కడవున్న యిల్లు పాడుపడిపోతోంది. పొలం విషయం ఏమైందో తెలియటంలేదు" - అంటూ చెప్పుకొచ్చింది. వాళ్ళు, చేసేదిలేక, "నీయిష్టంవచ్చినట్లు వెడతానంటే వెళ్లు. అభ్యంతరమేమీ లేదు" - అన్నారు. ఆ వారంచివర్లో, శారద, కుమారుణ్ణి ఎత్తుకొని, తన సామానుతో, స్వగ్రామంకివచ్చింది. వున్నపొలం తిరిగి పూడ్చిద్దామనుకొని, కవులుచేసే రైతునిపిల్చి, పూడ్చమని చెప్పింది. మొంగదిక్కు లేక

పోవటంతో, శారదకు అన్నివిధాలా చిక్కులేర్పడినయి. చేతిలో కానీలేదు. ఉన్న అప్పులు వడ్డీతో పెరిగిపోతున్నయి. తీర్చటమనేది కుదరటంలేదు. యిలాంటి విషమస్థితిలో, వీరభద్రంని సాయమడగక తప్పలేదు. అతను ఎగిరి గంతేసాడు. తను, నారాయణరావువల్ల పొందిన, సాయాన్ని అడ్డుపెట్టుకొని, శారదను, అనునయపరుస్తూ - "నువ్వేమీ డబ్బుకోసం యిబ్బంది పడవవసరంలేదు. నావద్దవుంది. దాన్ని, నీక్షేమంకోసమే వినియోగపరుస్తాను. కంగారుపడకు" - అంటూ, తనవద్దవున్న అయిదు వందల్ని ఆమెకిస్తూ, నవ్వాడు. ఆమె, ఆ పైకాన్ని తీసుకోకతప్పలేదు. పరిస్థితులలా చేసినయి. వీరభద్రంకి అనాలోచితంగా లొంగిపోయింది. అతను, ఆమెను వశీకరణ చేసుకున్నాడు. తనమకాం, ఆమె వద్దే పెట్టాడు. కాలంగడుపుతున్నాడు. శారద చెప్పిన పనల్లా, తలవంచుకొని చేస్తున్నాడు. ఎదురుమాట లేదు. పిల్లవాడిమీద, నారాయణరావు కెంతటి అనిర్వచనీయమైన, మమకారంవుండేదో, అలాగే, తనకూవున్నట్టుగా చూడసాగాడు. శారద రెండు పూటలా వుడకేసిపెడుతోంది. కాలం ఆక్షేపణగానే గడుస్తోంది. వూరు రకరకాలుగా అపవాదులు వేస్తూ, వింతవింతగా చెప్పుకొంటోంది. 'వీరభద్రం, శారదని వుంచుకున్నాడని,' వూరు చివరకు, ఒక నెలా-రెండు నెలలు గడిచాక, తూష్ణీంగా తీర్మానించి వేసింది. శారద ఆమాట విన్నరోజున తలెత్తుకోలేక పోయింది. వీరభద్రం, ఎంతోసేపు ఎదురుగా కూర్చొని, "శారదా! నువ్వేమీ భయపడకు—లోకం అనేక రకాలుగా అనుకోవటం పరిపాటి. లెక్ఖచేయ కూడదు. ఒకరికోసం మనం ఏమీ బ్రతకటంలేదు. ఒకళ్లసొమ్ము మనం ఏవిధంగానూ తినటంలేదు. ఎవరేమనుకున్నా ఫర్వాలేదు. నువ్వు నిర్భయంగా వుంటేచాలు. నీకున్న అప్పులన్నీ నేను తీర్చేస్తాను. నీకొడుకు విషయంలో ఏ అదుర్దాపడకు వాడికి నేను చదువుచెప్పి, బాగుచేస్తాను. ఉన్న, ఆ పొలాన్ని చూచుకొంటూ, జీవిస్తే, మనకేలోటూ లేదు." — ధైర్యంగా అన్నాడు. శారద కామాటలు నమ్మతగినట్లుగానే వున్నాయి. కాని, ఏదో అనుమానం ఆమెను చిత్రవధచేయటం మొదలెట్టింది. రోజురోజుకీ, వూరికాఱు కూతలు భరించలేనంతగా వున్నాయి, మనసు అశాంతితో కల్లోలితమై పోసాగింది. ఎక్కడికన్నా పోవాలనిపించింది. ఎవరు ఆశ్రయమిస్తారో? వూహించలేకపోయింది. మూడు నాల్గు నెలలనంతరం, ఒకనాడు. శారద, సామానంతా సర్దుకొని, కుర్రవాణ్ణెత్తుకొని, బయలుదేరింది. వీరభద్రం ఆశ్చర్యచకితుడయ్యాడు. ఎక్కడికో తెలియలేదు. ముఖమంతా చెమటలుపోసినయి. గుండె గుటగుటలాడుతోంది. శారద, నెమ్మదిగా, యింటికి తాళంవేసి, మెట్లుదిగబోతోంది. వీరభద్రం, ఆమె వెనకగా నిలబడి___

"ఎక్కడి శారదా?" తెల్లబోతూన్న ముఖంతో ప్రశ్నించాడు.

"మా బావగారింటికి?" - దృఢసంకల్పంతో చెప్పింది.

"నాతో మాట వరుసకైనా చెప్పకుండా వెళ్ళిపోతున్నావా?"

"యిందులో ప్రత్యేకంగా చెప్పవలసిందేముంది?"

"నన్ను ఒంటరిగా విడిచి వెళ్ళిపోవటం న్యాయమేనా?"

"యిక్కడవుండటంవల్ల నా మనస్సేమీ బాగోటంలేదు._

రోజు రోజుకీ, ఏదో అశాంతి నన్ను కలచివేస్తోంది. పాతరోజులన్నీ, గుర్తొస్తున్నాయి. చేసిన పాపం నన్ను భయపెడుతోంది. ఒంటరిగా వుండలేక పోతున్నాను."

"నేనున్నానుగా" - ఎంతో ధైర్యంతో అన్నాడు.

"నేనుండలేను..." - ఖచ్చితంగా తేల్చిచెప్పింది.

"శారదా!" - ప్రాధేయపూర్వకంగా పిల్చాడు. కళ్లుచెమ్మగిల్లినయి. కంఠం రుద్ధమైంది. విషణ్ణవదనంతో___

"నన్ను దిక్కులేనివాణ్ణిగా చేసిపోతావా శారదా! నేను నీకేకష్టమూ రాకుండా కాపాడాలనుకున్నాను. నాయావచ్ఛక్తీ నీకు ధారపోసి, నిన్ను సుఖపెట్టాలనుకొన్నాను. నీబాధల్ని, నావిగా యెంచుకొని, బ్రతుకుదామనుకొన్నాను. యీ చంటివాణ్ణిచూస్తూ, చేసిన పాపాన్ని క్షమించమని, దేవుణ్ణి కోరదామనుకున్నాను. నిన్ను కనిపెట్టుకొని వుండమని నారాయణరావు చెప్పబట్టే, కలకదకుండావున్నాను. నీబాధ్యతల్ని నేనే మోస్తున్నా, నువ్విట్లా వెళ్ళిపోవటం, నన్ను ఏడిపిస్తున్నట్టే. శారదా! వూరు

కదలకు వుండిపోవూ!" ప్రతిమిలాడాడు. శ్రమ పడ్డాడు వుంచటంకోసం. కాని. శారద, వుండదల్చుకోలేదు. వెంటనే, ఆతనిమాటల్ని, పెడచెవినిపెట్టి, పాడుపడిన దేవాలయం గోడల పక్కనుంచి నడిచి, నడిచి, బస్సుకోసం రోడ్డెక్కింది. నారాయణరావు గుర్తొచ్చాడు. వీరభద్రం ఏడ్చాడు. హఠాత్తుగా వచ్చిన శారదని చూసేసరికి, జగన్నాధం నివ్వెఱపోయాడు. దుర్గమ్మ - ధర్మారావు తెల్లపోయారు. జయలక్ష్మి చిరునవ్వుతో కళ్ళునులుముకొంది. శారద గడప దాటబోయేముందు ఒక్క క్షణం ఆగి, ముందుకికదిలింది. జగన్నాధం, శారదని పలకరిస్తూ, గతాన్ని ఒక్క పర్యాయం పునశ్చరణచేసాడు. దుర్గమ్మ ఆ సమయంలో పాతవాదాలన్నీ, ఏమైనయ్యోమరి, తెలియదు. చక్కగా పలకరించి, కోడలిచేత మంచి నీళ్లు, కాళ్ళుకడుక్కోటందుకు నీళ్లు యిప్పించింది. ధర్మారావు'పిన్నీ'అంటూ పలకరించాడు. 'నన్నెప్పుడైనా చూశావురా!" అంటూ, జయలక్ష్మి, రామకృష్ణుణ్ణి ఎత్తుకొని ముద్దాడింది. పది సంవత్సరాల నంతరం, శారద జీవితం యిలా మారినందుకు, అంతా సానుభూతిని కనపరిచారు. ఎంతో ఆప్యాయతతో, శారద కష్టసుఖాల్ని అడిగారు. ఆమె చెమర్చిన కళ్లతో, గూడుకట్టుకున్న దుఃఖంతో, కకావికలైన హృదయంతో, భారమైన నిట్టూర్పులతో, తన జీవితాంధకారాన్ని గూర్చి, చెప్పుకొంది. అంతరాత్మ ఆవేదన కొంతవరకు తీరినట్లనిపించింది. అయిన వాళ్ళతో, యిలాంటివి చెప్పుకొంటే, కొంత తీరని బాధయేదో తీరి, తేలికపడ్డట్టుగా వుంటుంది. శారదకా వేళ, అలాగేవుంది. తన కుటుంబంలో, శారద పట్ల యింత అవ్యాజమైన ప్రేమాభిమానాలు - ఆదరణ - ఆశ్రయం మూర్తీభవించి వున్నందుకు. జగన్నాధం ఎంతో ముచ్చటపడిపోయాడు. లోగడ లేనికలతలన్నీ మాసిపోయినందుకు సంతోషించాడు. సమష్టి కుటుంబంగా బ్రతకటమనేది, యిన్నాళ్లకు యేర్పడిందని తృప్తిపడ్డాడు.

శారద జీవితానికి, కొంతవరకు శాంతి యేర్పడింది. పిల్లవాడిపట్ల నెరవేర్చవలసిన విధులన్నీ జయలక్ష్మి చూస్తూవుంది. ఆమె కింతవరకు పిల్లలు లేకపోవటంతో, కొంతకొరత తీరినట్లనిపించింది. దుర్గమ్మ ఎక్కువగా యింటిపనుల్లో జోక్యం కల్పించుకోవటం లేదు. శారద పైపనంతా చేస్తూవుండేది. వంటపని జయలక్ష్మి చేసేది.

శారదకీ, జయలక్ష్మికీ మాటామాటా కలియటమే కాకుండా, మనసుకూడా కలిసింది. యిద్దరికీ, చిన్న వయస్సే. వరుసకీ, అత్తా - కోడళ్లయినారుగాని, వాస్తవంగా, ఆయింట్లో, అక్కాచెల్లెళ్లలాగా మెదుల్తున్నారు. 'తనయిల్లే' అనే దృష్టితోనే, శారద, నడుంవంచి, చాకరీ చేస్తూండేది. జయలక్ష్మికిప్పుడు, కొంచెం విశ్రాంతి లభించింది. వూపిరిపీల్చడానికి, తావుచిక్కింది. దుర్గమ్మ హాయిగా, రెండు పూటలూ భోంచేసి, మంచంవిరిగేవరకూ మగత నిద్రపోతూండేది. శారద, జయలక్ష్మి రధచక్రాల్లాగా, యిల్లంతా తిరుగుతూ పనిపాటలు చేస్తూండేవాళ్లు. ఎన్నడూ లేని, హాయి, జగన్నాధానికి శారదవచ్చిన దగ్గరునుంచీ లభించసాగింది. వేళపట్టున భోజనాలు అవుతూండేవి.

(సశేషము)

# హితరత్నములు

శ్రీ పోలాకి శ్రీనివాసరావు



(గతసంచిక తరువాయి)

ప్రేమింపుము జీవుల గని
ప్రేమించిన నవియు నట్లె। ప్రేమించును, నీ
ప్రేమకు ప్రతిఫల మలరుచు
సేమము లందెదవు మిగుల। శీఘ్రము, హితుడా।

నీతులు విన్నప్పుడు దమ
మూతులు త్రిప్పంగ దలచు। మూర్ఖులు బడసే
యాతనల నరసి విడువక
నీతికి దానుండ వగుచు। నెగడుము, హితుడా!

గఱికిని మేయును గాడిద;
గఱికే చిగురెత్తి బ్రతుకు। గాడిద చచ్చున్,
సిరికై పేదల గుంజిన
ధరలోపల బాగు పడునె। ధనికుడు, హితుడా।

తీఱిక సమయము లందున
జేరి పరిశ్రమలు జేయ। జెల్లును, దానన్
వారి దరిద్రము వాయును,
కోరుచు సోమరులు బుద్ధి। గొనవలె, హితుడా!

ధరలోన నేతి బీఱను
దొరకెడి ఘృత మెంతో యంతె। దొర యను బేరన్
బఱగెడు నీచుని పొంతను
దొరగుణములు నెన్నుటకును। దొరకును, హితుడా!

మితి మీఱి ధనము జెఱుపక
మితముగ వెచ్చమును జేసి। మిగిలిచి దానన్
గతి కొఱకు దాచి పెట్టిన
వెతలకు లోబడక బ్రతుకు। వెలయును, హితుడా

కొంచెంబని యెంచక తా
ముంచెడి దెంతేని చాల। యుపయుక్తంబౌ;
కొంచెము, గొంచెము ధనమే
యుంచుచు నున్నపుడు పెరుగు। నుర్విని, హితుడా!

సిగరెట్లను, బీడీలను,
పొగ చుట్టల దగుల బెట్టి। పొట్టకు కఱవై
యుగ చాల్లు పొందు ఱెల్లను
నగు బాటుల పాలుగాక। నాడెమె? హితుడా!

గింజల నేరే కోడికి
రంజన గల విలువయైన రత్నములేలా?
గంజాయి మత్తు వానికి
వింజామర విసరు టేల। వృథ కే, హితుడా!

దండను శిష్యుల జేరిచి
దండిగ తన విద్య నిడక। దాచుట వలనన్
పండితు పాండిత్యము కడు
దండుగ యని దలప వలయు। ధరలో హితుడా!

తన పొల్లు మాటలే కడు
ఘనమైన వటంచు బల్కు। కయ్యము సేసే
మనుజుని నెడబాయుట స
జ్జనునకు విధియంద్రు బుధులు। జగతిని,
హితుడా!

వర విజ్ఞానము కోఱకై
సరిగా మేదస్సు బఱపి। చరియింపని చో
బరువైన మట్టి తలయను
పరిహాసము పాలు గాక! బాగా? హితుడా!

మొద్దునకు సుద్దు గూర్చిన
హద్దును విడనాడి తిరుగు। నట్టులె పుడమిన్
బుద్ధి విహీనుని బోధకు
ఖద్దరు గట్టించి బంపు। గతియా, హితుడా!

తమ దేహము, తమ గేహము,
దమ ప్రాంతము శుభ్రతకును। దావొసగిన చో
దమ యారోగ్యం బెంతో
విమల వికాసమ్ము గాంచి। వెలయును,
హితుడా!

ఘోరంపు టంటు వ్యాధులు
చేరిన నవి దాచి బెట్ట। చెడుగే కూడున్
క్రూరముగ దలచి వానికి
దూరముగా నుండు టెంతొ। దొడ్డగు,
హితుడా!

చేతి రుమాలున బలుమరు
మూతియు, జేతులను దుడిచి ముడిచికొనుచున్
ప్రీతిగ జేబున నిడుకొను
నేత లనాచార మందు। జేరును, హితుడా

వేసము వేసుక తిరిగే
మోసపు మనుజులను జేర। మోసము ప్రేమన్
బోసిన పాలను ద్రావుచు
మోసము దలపోసి పాము। పొడవదె?
హితుడా!

ఎఱిగియు బలవంతుని తో
సరిగా దులదూగ నెంచ॥ సాధ్యం బగునా?
త్వరగా బోయెడి మోటరు
పరుగిడి దా నెక్కబోవు। పగిదిని,
హితుడా!

జాతుల, మతముల నెంచుచు
ఘాతకులై నీతిమాలి। కలిహించుట చే
ఖ్యాతిని జెడి బాధల గని
గోతిని పడు గొడ్ల రీతి। గుందరె?
హితుడా!

మోసము జేయగ కపటపు
వేసములను వేసిగొనుచు। భిక్షుకుల
క్రియన్!

దోసిలి యొగ్గడి చోరుల
మోసము సవరింప లోక। పూజ్యము,
హితుడా!

విరివిగ సంపద గాంచియు
ధరలో దా దినక లోభి। దాచుట యెల్లన్
చెఱకుల బండిన్ గూర్చొని
కొఱుకుట మునిగోల కాదె। గోరిక,
హితుడా!

మొద్దునకు సుద్దు గూర్చిన
హద్దును విడనాడి తిరుగు। నటులె పుడమిన్
బుద్ధి విహీనుని బోధకు
ఖద్దరు గట్టించి బంపు। గతియా, హితుడా

(సశేషము)

# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



(గత సంచిక తరువాయి)

కనుక, అభీక్ష్ణము అనుపదము అతినిరాడంబర పదముగనున్నను, మిక్కిలి ప్రాముఖ్యత, అర్థభావము కలిగియున్నది. మనయందు అనుభవమునగల ఇట్టి మాత్మ అంశమువలన, ఆత్మదృశ్యమును, ఆత్మ అదృశ్యమగుటను ఉదాహరణముతో తెలుపబడుచున్నది. ప్రారంభదశధ్యానమందు, ఆత్మానుభవము ఆకస్మికముగను, మెరుపువలె అతిక్షణికమును కలుగుటను అందరికిని సన్నిహిత అనుభవమునయందు చక్కని ఉదాహరణముతో తెలుపబడుచున్నది.

తద్ధి తద్వనంనామ తద్వన మిత్యుపాసితవ్యం
స య ఏత దేవం వేదాభిహైనం సర్వాణి భూతాని సంవాంఛంతి ॥

బ్రహ్మము తద్వనమనబడును. అతడు సర్వభూతాత్మ అని ఉపాసించవలెను. బ్రహ్మము తద్వనం అని ధ్యానించవలెను. ఇట్లు తెలిసినవానిని సర్వభూతములు ప్రేమించును.

ఈ ఉపనిషత్తునందు ఇదివరకు తెలిపబడియుండు విశేషములను గ్రహింపజాలని మందాధికారులకు, ఇచ్చట గురువు ఒక ఉపాసనా విధానమును తెలుపుచున్నాడు.

నేటికాలమున, మతవిషయములలోగాని, పారమార్థిక విషయములలోగాని, ఉపాసనాక్రమములు అరుదుగనున్నవి. వేదకాలమునందు, ప్రతిసాధకునకును ఉపాసన క్రమము చక్కగ శిక్షింపబడియుండెను. ఉపాసకుడు తన మనసును ఏకభావమున నియమించి, భూతములను ఉపాసించుచుండెను. ఆలోచనలన్నిటిని తొలగించి, ఏకవిషయమున ధ్యానము చేయుటవలన, ఉపాసకుడు త్వరలో ఫలితంపొందుచుండెను. వేదాంతమున తెలుపబడు ఆత్మవిషయములను తెలియగోరు సాధకునకు ఉపాసనవల్ల, ఏకాగ్రత, అంతరాభివృద్ధి అను సంపద చేకూరుచున్నది.

నేటికాలమున హిందువులలో ఉపాసనచేయువారు అతిస్వల్పముగనున్నారు. పూర్వకాలపు జ్ఞాన సాధనతో చేయు శాంతిధ్యానమునకు బదులు, నేడు భక్తిమార్గమొకటి ఏర్పడియున్నది. ఇది ప్రేమభావములుప్పొంగి, మనసును ధ్యానమువంటి ఏకాగ్రస్థితికి తెచ్చుచున్నది. వ్యాసులు, పురాణముల మూలమున భక్తిమార్గమును ప్రపంచమునకు కలిగించెను. పురాణములు ఏర్పడుటకుముందు, ఆర్యులు అంతర విమర్శను, ప్రశాంత ఆవరణమున, నిర్మలజ్ఞాన సాధనవల్ల నిరంతర మభ్యసించుచుండిరి.

ధ్యానమువలెనే, భక్తిసాధనవలన కూడా ఉన్నత విచారము పరమాత్మ చింత ఏర్పడుచున్నది. పరిపక్వదశపొందని సాధకులు ఇట్టి మార్గమున శిక్షణపొంది, మరల నిర్గుణ నిరాకార బ్రహ్మమును ధ్యానించవలెను. ఇందునిమిత్తము, క్రిందిఅంతస్థులలోనుండు సాధకులకు ప్రాథమిక శిక్షణగా, ఒక ఉపాసనవిధమును మిక్కిలి ప్రేమతో శ్రుతినిర్దేశించుచున్నది. పరమాత్మను సర్వభూతాంతర్యామి తద్వనం అని పారమార్థిక సాధకుడు ఉపాసించవలెను.

ఈశ్రుతియందు పరస్పర విరోధభావములున్నట్లు విమర్శకులకు తోచగలదు. ఈ కేనోపనిషత్తునందలి ప్రథమభాగమున విగ్రహారాధనను ఖండించబడియున్నది. దీర్ఘవిమర్శవలన, ఈఖండన విగ్రహారాధనను ఖండించుటగాదు. సాధకులు విగ్రహారాధనయే పరమపద ప్రాప్తిఅని భ్రమించకూడదు. ఆరాధన, ఉపాసన గమ్యస్థానములుకావు. సాధకుని అంతఃకరణములగు మనోబుద్ధులను నిర్మాల్యముచేసి, పరిష్కరించుటకు ఇవి సాధనలు. ఈ కారణముల సంస్కారము పూర్తికాగా, సాధకుడు వీటిని ఉపయోగించి, తీవ్రధ్యానము చేయగలుగుచున్నాడు. సామాన్యముగ వివేకము, విరాగములేని మానవులు, పారమార్థిక మార్గమున జారబడి, తమ ఇష్టసిద్ధి కొరకు తమ సాధనను వ్యయముచేయుచున్నారు. ఉపాసనలవల్ల పొందగల ఉన్నత పదవులను కోలు

పోవుచున్నారు, "మీరు ఉపాసించునది చక్కని మార్గము కాదు" అని శ్రుతిహెచ్చరించుచున్నది. ఇంద్రియానందములు, ఇహపరసుఖములు ఆశించి ఉపాసన చేయకూడదు.

"నీ ఆలోచనల మేరకు నీవు పరివర్తనము చెందుదువు" అనునది అసుర శాసనముగనున్నది. ప్రపంచమునగల సర్వమతములు ఈ ప్రకృతి సిద్ధాంతముమీద ఆధారపడియున్నవి. ఇందుకు శ్రుతిమాతయొక రహస్యమును తెలుపుచున్నది. పరమాత్మ సర్వభూతాంతర్యామి అని ఉపాసించు సాధకుడు తాను ధ్యానించు ధ్యేయవస్తువగుచున్నాడు. అందువల్ల, తన తరము నందలి మానవసమాజమంతయు అతనిని ప్రేమించి గౌరవించుచున్నది.

"తమేవ శరణంగచ్ఛ"

—o—

## ఆత్మసంస్కార విధానము

ఉపనిషదం భో బ్రూహీత్యుక్తా త ఉపనిషద్
బ్రాహ్మీం వా తత్ ఉపనిషద మబ్రూమేతి॥ 7,

శిష్యుడు:- స్వామిన్ తరింపజేయు జ్ఞానము బోధించుడు.

గురువు:- తరింపజేయు జ్ఞానము నీకు బోధించియున్నాము.

ఇంతవరకు తరింపజేయు బ్రహ్మజ్ఞానమును నీకు బోధించియున్నాము.

ఇందుగల ప్రశ్నయొక్క భావము, ఉపనిషత్తు బోధపొంది దానిని చక్కగ గ్రహించజాలనందున శిష్యుడు ప్రశ్నించుచుండుటకాదు. శాస్త్రము పూర్తిగ విమర్శింపబడినది. ఇక ఇందు తెలుపవలసినది ఏమియు మిగిలియుండలేదు అను భావమును తెలుపు సాంప్రదాయము ఇందు కనబడుచున్నది.

మరియు, గురువు చరమోపదేశముగ నేమైన తెలుపనున్నాడా అను ఆతురత శిష్యుని భావమున కనబడుచున్నది. అట్టిమాటలు శిష్యుని హెచ్చరిక వాక్యములుగ నుండవచ్చును. వాటినికూడ వినవలెనను కుతూహలము తెలియుచున్నది.

మరియు, ఇదివరకు తానువినిన ఉపనిషత్ బోధ చక్కగ తెలియుటకు అంతరాభివృద్ధిపొంది తన యందు ఆత్మదర్శనము పొందుటకు యోగవిధానమేదయినయున్న తెలియుకోరుచున్నాడు. ఈ భావము ముందు రాగల మంత్రమున తపను, మొదలగు విధానములు ఉపనిషత్ మంత్రములను గ్రహించుటకు అవసరమని తెలుపుటవల్ల అనుమానించవలసియున్నది.

తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా
వేదా సర్వాంగాని సత్య మాయతనమ్॥ 8.

తపను, దీమము, నిష్కామకర్మ, ఇవి తరింపజేయు ఉపనిషత్తు జ్ఞానమునకు గూఢాది వేదములు దాని అంగములు. సత్యము దాని నిలయము.

ముందు మంత్రమున ఉపనిషత్తు ముగిసిన దీని గురువు తెలిపియిన్నాడు. అట్లుండియు, శ్రుతి యందింకను మంత్రములు చేర్చుటయందలి భావమేమి? సంవాదరూపమున నెలకొనియుండు ఉపనిషత్తు రూపములకు ఇదొక లోపముగా కనబడజాలదు. శిష్యుడి "స్వామిన్! తరింపజేయు జ్ఞానమును బోధింపుము" అని కోరియుండెను. ఈ వాక్యముల భావములు రెండు రీతులనుండగలవు.

(1) గురువులు ఉపనిషత్తు భాగము పూర్తియయినదని స్పష్టముగ తెలుపవలెనను ఆశయము. (2) శిష్యుడు ఆత్మసంస్కార విధానసూచనలు ప్రత్యేకముగ తెలియగోరు అభిలాష - తెలుపుచున్నది. గురువు జ్ఞానేంద్రియముల, మనోబుద్ధుల నియమించు ప్రభువును విపులముగ వివరించియుండినను, అజ్ఞానదశ యందుండువారు అట్టి పరమాత్మజ్ఞానమును పొందగల సాధనలను వర్ణించియుండలేదు.

ఇట్లు శ్రుతులు తెలుపు పరిపూర్ణపదవిని పొందగల విధానములను తెలియగోరుట హిందువుల వేదాంత సిద్ధాంతమునగల ప్రత్యేక సౌశీల్యము. ప్రపంచమున ఏ ఇతర జాతియందును ఆర్యవంశ పితామహులు పోషించు కళాసంస్కృతి కానరాదు. ఋషుల ఆలోచనా విధానములు కడువిశాలమయినది. తర్కసమ్మతమయినది. వారు స్థాపించిన వేదాంత సిద్ధాంత మతము సత్యప్రేమ సిద్ధాంతము. బహుసహన భావము గల మతము.

ఆర్య సంతతివారికి మతమనగా జీవితదృశ్యము కాదు. నిష్కామ కర్మయోగులకు జీవితదృశ్య స్వప్నములు నప్పుంపకి వ్యవహారములుగనుండెను. పాశ్చాత్య దేశములయందు నేడుకూడ మతసిద్ధాంతములెల్ల జీవిత దృశ్యములుగ ఎన్నుకొనబడుచున్నది. కనుక వారు సుగుణసంపదల ప్రకటించలేకున్నారు. తరతరములనను

జీవిత దృశ్య భావములుమారుచు, కాలానుగుణముగ పరివర్తనము చెందుచున్నది.

ఆర్యపితామహులకు మతమనగా, జీవితదృశ్యము కాదు. జీవి విధానముగనున్నది. సంస్కృతమున మత సిద్ధాంతములను "ధారణ" అనబడును. అనగా తెలుసుకొనుట అను ధాతువునుండి ఉత్పత్తిపొంది యున్నది. సత్యస్వరూపము ఎంతటి సూక్ష్మమయినను దానివర్ణన తెలిసినంతటితో ఋషులు తృప్తిపొంద లేకుండిరి. ఒక దివ్యభావము వారిబుద్ధికి తెలిసిన వెంటనే, దానిని జీవితమున అనుసరించి జీవాంశముగ ఉపయోగ పెట్టుచుండిరి.

అదేవిధముగ సత్యవిచారగమునకూడ, పరమాత్మ తత్వము తెలుసుకొనిన వెనుక, ఒక ప్రతీకమును తెచ్చి, దానికి పూజచేసి, మ్రొక్కి నమస్కారములు చేయుటతో వారికి తృప్తికలుగకుండెను. ఆర్యుల సనాతన ధర్మ ఆశయము ఆత్మసాక్షాత్కారముగ నుండెను. కథా, కావ్యములు, కవిత్వము, కవితా చాతుర్యములు వారికి పసిబాలుర ఆటలవలెనుండెను. వారి సంస్కృతి జీవితకళగా ఏర్పడుచుండెను. స్వప్న వ్యవహారములుగ నుండలేదు.

ఇట్లు శిష్యుని ప్రశ్నయందు మాటలతో తెలుపని భావార్థము విశేషముగా దాగియుండెను. అతడు కాలానుగుణముగ పరిపక్వదశపొందిన శిష్యుడుగ నుండెను. తదనుగుణముగ గురువుకు శిష్యునిఆతురత బాగుగ తెలిసియుండెను. శిష్యుడు పూర్ణజ్ఞానము పొందుటతో తృప్తిపొందజాలడు తాను విమర్శించిన ఆత్మజ్ఞానమును, జీవించి, అనుభవించి, తాను ఆత్మగ యుండవలెనని కోరుచున్నాడు. కనుక గురువు సనాతన ధర్మమునకు గుణాదిసాధనములను ఈ మంత్రమున తెలుపుచున్నాడు.

పరమాత్మ తపను, దమము, నిష్కామకర్మలమీద ఆధారపడియున్నాడు అని ఉపనిషత్తు తెలుపుచున్నది. సూక్ష్మాతి సూక్ష్మమగు ఆత్మతో ఐక్యము పొందుటకు పై అంశములు అత్యావశ్యకమని సామాన్యముగ ఊహించగలుగుచున్నాము. ప్రపంచమున ఏ మతముగాని, ఈ గుణములను తృణీకరించజాలదు. నేటికాలమున ఇట్టి గుణములను వదలి వీటికి వ్యతిరిక్తముగ జీవించుచుండుటవల్లనే, నవీనజీవితమున విషము వ్యాపించియున్నది. వ్యక్తిగతముగగాని, సాంఘికముగ, జాతీయమున, అంతర జాతీయమున గల దుఃఖములకు, ప్రమాదములకు కారణము ఇట్టి సుగుణసంపత్తిని దూరముచేసియుండుటయే అని స్పష్టముగ తెలియుచున్నది.

సాధకుడు తన మానసిక కోరికలను తిరస్కరించ గల ధైర్యసాహసముండిననే, పారమార్థిక మార్గమున అభివృద్ధి పొందగలడు. మనసుయొక్క కోరికలను ఎదిరించగల ధైర్యములేని అబలాస్వరూపునికి మతము సహాయ మొనర్చదు. విషయురాగములయందుగల రుచిని వదలలేక కడుకష్టములను సహించు మనసును అరికట్టి, సత్యమార్గమునకు మరల్చి, ముందు పోగలగిన సాధకునికి ఫలము త్వరలో చేకూరును. అందువలన శ్రుతియందు తపను అత్యవసరమని తెలుపబడుచున్నది. పరమాత్మయొక్క దేవళమునకు తపను గుణాదియని శ్రుతి తెలుపుచున్నది.

తపను అనగా, ఇహలోక సుఖానందములకోరు ఇంద్రియములు విషయ సంపర్కములను పొందనీక చేయగలుగుట తపను అనబడును. మనసునందు కోరికలు ఉత్పత్తి పొందనీయక అణచివేయుట దమము అనబడును. రెండు కార్యములును ఆత్మనిగ్రహముగ పరిణమించినను, తపను అనునది, శారీరక నిగ్రహము, దమము మానసిక నిగ్రహము.

ఆత్మ నిగ్రహములేక ఆత్మసంస్కారము లభించదు, స్వప్నతుల్యమగును. గ్రుడ్డివాడు తన కుమారుని ఒక్కపర్యాయమయిన చూడవలెనని కోరుటగా నుండును.

సాధకుడు, శారీరకముగ, మానసికముగ నిర్మలత పొంది అభివృద్ధిపొంది, దైవీగుణముల పొందగలిగిన పిమ్మట, అతడు నిష్కామకర్మ చేయుచుండవలెనని శ్రుతి ఆశించుచున్నది.

పై వివరములు సరియని తలచినచో, శ్రుతి "పరమాత్మపదవికి కర్మగుణాది" అని తెలుపుచున్నాదే, దాని భావమెట్లు సరియగును అను సందేహము కలుగగలదు. బ్రహ్మవిద్యయందు కర్మ అనగా, పారమార్థిక సాధనలన్నియు చేరుచున్నవి. పూజ, ప్రార్థన, సత్సంగము, జపము, ధ్యానము మొదలగు భక్తి సాధనములన్నియు కర్మయనబడుచున్నవి. మరియు, సాధకుడు, ఇహలోకసుఖములు పరలోక సుఖములు అపేక్షించి పూజాప్రార్థనలు చేయకూడదని శ్రుతి హెచ్చరిక జేయుచున్నది.

స్వార్థరహిత గోపికాప్రేమవంటి భక్తికలిగియుండుటవల్ల, పరమాత్మ మన పరిసరములయందే క్రీడ

తెలుపుచు మన అజ్ఞానమువల్ల మనలో పేరియుండు వాసనలనెల్ల హరింపజేయగలదు.

బాహ్యతపస్సు, అంతరదమమును, శ్రద్ధావిశ్వాసములతో అనుష్టించగలిగిన సాధకుడు, కర్మచేయుటకు యోగ్యత పొందుచున్నాడు. అతడే కర్మకు అధికారి. అతడే బ్రాహ్మణుడు. అట్టి కర్మయోగి, చక్కని శ్రద్ధాభక్తులతో, హిందూమతమున తెలుపబడియుండు మార్గమును అనుసరించగలిగినను, తత్ఫలితముగ ప్రాథమిక ధ్యానశిక్షణకు అర్హుడగుచున్నాడు. పిమ్మట సాధనవల్ల ప్రశాంత దీర్ఘధ్యానమువల్ల పరమాత్మను తెలుసుకొని, సాక్షాత్కారముపొంది అతనియందే నివసించగలడు.

ఈ ఉపనిషత్తునందు ఇది చివరిమంత్రముగా నున్నది. అయినను, ఈ ఉపనిషత్తునందంతటికి, జీవిత మార్గమును అనుష్టించు విధానము తెలుపు మంత్రము ఇదియొకటియేయున్నది. కనుక దీనియందలి ప్రతి పదమునకును అధిక భావార్థము, ప్రాముఖ్యతకూడి యున్నది. విచక్షణతో వాటిని పరిశీలించుకొలది విశేషఫలము కలుగుచున్నది.

ఆత్మకు వేదములు అంగములు అని ఈమంత్రమున తెలుపబడుచున్నది. వాస్తవముగ పరమాత్మకు అంగములు లేవు. అంగములుండిన సామరూపములు కలుగుచున్నవి. అనగా, ఆరు ఉపవేదములు సాధకునికి ఉపకరించి, తనయందు ఆత్మను కనుగొనుటయందు సహాయపడుచున్నదని భావము. నవీన విద్యావంతులు, శాస్త్రజ్ఞానములేని అశిక్షితునికి ఆత్మసాక్షాత్కారము కలుగజాలదు. కలుగుట అతిదుర్లభమని యెంచవచ్చును.

కాని ఈ మంత్రమువలన, పరమార్థ సాధకులకు ఎట్టి శిక్షణ అభ్యాసము, సంస్కారము వృథాయగుటలేదు. ఎట్టి అల్పజ్ఞానముగాని, నిష్ప్రయోజనకరము కాజాలదు. అని ఈ మంత్రము నొక్కి తెలుపుచున్నది. ప్రతిజ్ఞానసాధనము పరమార్థిక మార్గమున ఉపయోగపడుచున్నది.

• చివరకు, "సత్యమాయతనం" అను భావమును గూర్చి గ్రంథములు వ్రాయవచ్చును. సత్యమునకు సత్యమే నిలయము అని దీని అర్థము. సత్యవాక్పరిపాలనయను దీక్షలేనిది సత్యనిలయమును ప్రవేశింపజాలము. ఒకసాధకుడు, భావములు, కోరికలు, కర్మలు ఒకటి కొకటి అనుగుణముగ నుంచుకొనవలెను. అట్లు అనుగుణముగ లేక, పరస్పర ద్రోహములుగనుండిన, భావములకు వ్యతిరేకముగ కోరికలు, కోరికలకు వ్యతిరేకముగ కర్మలు యుండినయెడల వారిని చండాలురు అని ఉపనిషత్తుల ఆవరణమున యెంచబడుచున్నారు. వారు సత్యధామమును ప్రవేశింపయోగ్యులు కారు.

సత్యమునకు సత్యమే నిలయము అని ఉపనిషత్తు తెలుపుచున్నది. వ్యావహారమున కళంక రహితముగ నుండకపోయినచో, పారమార్థికమున అభివృద్ధిదొరకదు. సాధకుడు సంసారావ్యవహారమునగాని, దైవిక పరిశ్రమయందుగాని అనుమానమునకు పాత్రుడు కాకూడదు.

**యోవా ఏతా మేవం వేదాపహత్య**
**పాప్మాన మనన్తే**
**స్వర్గేలోకే జ్యేయే ప్రతితిష్ఠతి, ప్రతితిష్ఠతి॥ 9.**

ఇట్లు తెలిసినవాడు పాపములనెల్ల పహరించిబ్రహ్మమున, అనంత, ఉత్కృష్ట, ఆనందలోకమున ప్రతిష్ఠితుడగుచున్నాడు. ప్రతిష్ఠితుడగుచున్నాడు.

ఓం, శాన్తిః శాన్తిః శాన్తిః

ఈ కేనోపనిషత్తునందలి కడపటి మంత్రమున ఇంతవరకు విమర్శించియుండు సిద్ధాంతమును గ్రహించగలిగిన వ్యక్తి పరిపూర్ణ పరమపదవి చేరగలిగియున్నాడని గురువు దృఢముగ తెలుపుచున్నాడు. బ్రహ్మను తెలిసికొనతడు బ్రహ్మమగుచున్నాడు. అను సూత్రమునకు గురువుయొక్క అభిప్రాయము అనుకూలముగనున్నది. మన నిజస్వరూప జ్ఞానములేని దోషమువలన నిర్వీర్య పరిమితులలో ఊపిరిత్రిప్పుకొనలేకున్నాము. మన స్వరూపము కోలుపోయియున్నామను భావముతో సర్వదుఃఖములను అనుభవించుచున్నాము. ఇది కేవలభ్రమ, మనకు ఎట్టి నష్టమును కలిగియుండలేదని తెలుసుకొనవలెను. తక్షణమే పరిపూర్ణ ఆనందమగు మన నిజస్వరూపమును అనుభవించగలము. అజ్ఞానరోగమునకు జ్ఞానమే చక్కని ఔషధము. పగ్గమును తెలుసుకొనుటవలన పాముకాటు నివారణ పొందుచున్నది.

(సశేషము)

# టమాటో పండ్ల వాడకం



మనం అనుదినం అహారమును అమర్చుకునే ముందు మనము సేవించనున్న ఆహారపు విలువనుకూడ తెలిసికోడం మంచిది. మన ఆయురారోగ్యాలకు ఉత్తమమైన ఆహారమును అమర్చుకోడానికి పదార్థ విజ్ఞానముతో బాటు, రుచికరంగాను, స్వయం సమృద్ధంగాను నుండునట్లు ఆహారమును రూపొందించుకోడం తెలిసియుండాలి. మనము స్వీకరించే కాయలు పండ్లు, ఆకుకూరలు సంవత్సరంలో ఋతువులవారీగా నేలభిస్తుంటవి. వానిని మన అవసరాలకు ఎప్పటికప్పుడు వినియోగించుకోకలుగాలి. కొన్ని కాయలు, పండ్లు ఉడికిస్తే ఆహార విలువలను కోల్పోతవి. కాబట్టి సాధ్యమైనంతవరకు ఉడికించకుండా శాకపాకములు చేసికోవచ్చును. ఇందులో టమాటో పండ్లు ప్రధానములు.

టమాటోలను రామమునగ పండ్లు అంటారు. అవి ఆహారంగా అనేకవిధాల ఉపయోగపడతవి.

టమాటో పండ్లను ముక్కలుగా తరిగి చక్కెరచల్లి తింటే చాల రుచిగా నుంటవి. ఎండాకాలంలో టమాటో పండ్ల రసం చాలయింపుగాను, ఆరోగ్యముచేకూర్చునదిగానుంటుంది.

టమాటో పండ్లను సన్నని ముక్కలుగా తరిగి, తగుమాత్రంగా ఉప్పు, కారము వేసి చంచాతో బాగాకలిపి అందులో మంచి పెరుగును వేసి కలిపి తిరుగపోతపోసి భోజనంలో ఉపాహారంగా వాడినచో చాల రుచికరంగా నుంటుంది.

రొట్టెల్లోకి, దోశలలాంటి పలహారములలోకి టమాటో పండ్ల పచ్చడి చాల రుచిగా నుంటుంది. టమాటో పండ్లను సన్నగా తరిగి ముక్కలను గిన్నెలోనుంచి, అందులో తగుమాత్రంగా ఉప్పు, కారం, కావలసియున్నచో ఇంగువ పాలు వేసి చంచాతో బాగా కలిపి, కొంచము సేపయిన తరువాత తిరుగపోత పోసినచో అమృత తుల్యంగా తయారగుతుంది. అది ఫలహారములకు ప్రత్యేకమైన రుచిని యింపును కలిగిస్తుంది.

ఇంతవరకు టమాటోలను పొయిమీద పెట్టకుండా తయారగు అన్న సాధకములు, వీని సేవనము ఆరోగ్యప్రదమైనది. టమాటో పండ్లలోని ఆహారవిలువలు (విటమినులు) పొయిమీద పెట్టి ఉడికించకపోయినచో తగ్గిపోవు.

ఇక సాధారణంగా టమాటో పండ్లను సాంబారు (పప్పుపులుసు), చారులోముక్కలుగా తరిగివేసి చేస్తారు. టమాటోపండ్లు పులుసు, చారు, కూటులాంటి వంటకములకు ప్రత్యేకమైన రుచినికలిగిస్తవి.

బెండకాయ, వంకాయ, సొరకాయల లాంటి ముద్దపులుసులలో టమాటోలవాడకం చాల రుచిగానుంటుంది.

వంకాయకాల్చి పచ్చడి నూరేసందర్భమున టమాటో పండ్లముక్కలను సయితము చేర్చినచో మరింతరుచిగా నుండును.

వంకాయకూర వండునప్పుడు, వంకాయముక్కలతో బాటు, టమాటో పండ్ల

ముక్కలనుకూడ కలిపి తిరుగపోతలోవేసి మగ్గనిచ్చినచో చాల రుచిగా నుండును.

మామిడికాయ, దోసకాయ, పొట్లకాయ పప్పుకూరలలో టమాటో పండ్ల ముక్కలు చేర్చి వండినచో చాలరుచిగా నుండును.

టమాటోలు పుష్కలంగా, నారికే కాలంలో చౌకకూడకాబట్టి సద్వినియోగంచేసికొని చక్కని ఆరోగ్యకరమైన ఆహారమును అమర్చుకొనుట విజ్ఞత.

'కాంతి'

—(o)—

# "మనయింటి మహాలక్ష్మి!"

శ్రీ సురభి నరసింహాము

వరగుణమ్ముల ప్రోవు_వరలక్ష్మి మనగోవు!
మాతృభావము మదిని_మెదలంగ చూడుమనన్
వాత్సల్యమూర్తియై_సరలుచున్ మనయిండ్ల
మహిత సంపదలిచ్చు_మహనీయ సచ్చరిత॥
ఊరివెలుపల తిరిగి_పూరిమేయుచునుండ
పొదుగుపాత్రల పాలు_పొంగగా, అంకెలన్
పరువెత్తి, బహుక్షీర_ధారలన్ కురియించి
బిడ్డలకు, మనకెల్ల_కడుపునింపెడి తల్లి॥
ఇలు వేల్పుగానుండి_బాలవృద్ధులగాచి
పాలవెల్లిగ నిండ్ల_పావనత్వముఁగూర్చి
పశుసంపదలనిచ్చి_పుణ్యముల్ గలిగించి
కల్పభూజమువోలె_కళలఁగూర్చెడి తల్లి॥
పసుపు కుంకుమఁబూసి_పూలమాలలు వేసి
పూజించు పడఁతులన్_పుత్రవతులనుఁజేసి
కామితార్థములిచ్చి_కామధేనువువోలె
దీపించి, మనయిండ్ల_తేజరిల్లెడి తల్లి॥
పుడమిదున్నుట కొఱకు_కోడెదూడల నిచ్చి
పాడి సంపదకలుగ_లేఁగలన్ కలిగించి
రైతు జాతికినిచ్చు_రతనాల రాసులన్
సుదతి జగతికినిచ్చు_సౌభాగ్య గరిమలన్॥
గమనింపు డొకసారి_గోపూర్వచరితమ్ము!
ఆశ్రమనమ్ముండు_కౌశికుండను రేఁడు
వాసిష్ఠుఁజొచ్చి_భాసించు "సురభి"గని
బలయుక్తుఁడై పట్ట_బోవగా, ఘోరాడి
మాహాత్మ్యమును జూపి_మరలి వచ్చినధీర॥
అలదిలీపుడు నాడు_కొలము నిల్పెడి కొడుకు
కలుగనందున, వగచి_కులగురుని ప్రార్థించి
జాయా సమేతుఁడై_శ్రద్ధతో భక్తితో
"నందినిని" సేవించి_నందనుని కనగల్గె॥
వ్రేపల్లెవీధులన్_విష్ణుదేవుడు నాడు
గోపాలుఁడై వెలిగి_గోవిందుఁడై మెలఁగ
అమృత ధారలవంటి_క్షీరవర్షము నొసగి
తృప్తిగూర్చినమాత! తృష్ణదీర్చిన మహిత॥
"కపిలా"ఖ్యయగు గోవు_కాననంబున కేఁగ
అసువులను హరియింప_వెసరాగ వ్యాఘ్రమ్ము
సత్యశపథమునిచ్చి_సత్వరమ్ముగవచ్చి
క్రూరసత్వపు మదిని_కరుణనించిన చరిత॥
ఓ పుణ్యవతులార! ఓ పూతమతులార!
సౌభాగ్యసౌఖ్యాలు_సమకూర్పగానెల్ల
మనయింటి మహాలక్ష్మి_ధేనువై వెలసినది
సేవించి, పూజలన్_సత్ఫలమ్ములఁ గొనుడు॥

—o—

# హిందూసంఘము - వివాహము



కంచి కామకోటి పీఠాధిపతులు, శ్రీ శంకరాచార్యస్వాములు హిందూ సంఘములోని వివాహ వ్యవస్థనుగురించి వెల్లడించిన అభిప్రాయములు శ్రీ అబ్బరాజు శ్రీనివాసమూర్తి బోటివారికి కటువుగా కనుపించినా విమర్శనలు మాత్రము వాస్తవికతను ఎదుర్కొ లేక పోయినచో నిర్మాణాత్మకములు కాజాలవు.

ఈడు జోడు పారచూడకుండా ముక్కుపచ్చలారని వయస్సులో వివాహములు తలపెట్టడం ముమ్మాటికి అవాంఛనీయమే. కాని ఏదో కారణములవల్ల, అసాధారణ పరిస్థితులలో అలా జరిగిన వివాహములను వ్రేలెట్టిచూపుతూ పూర్వకాలములో వివాహములు చాల చులకనగా చూడబడినవనడం సముచితంకాదు. ఆ నాడు, యీ నాడుకూడ ప్రపంచమంతటిలోను పవిత్రమైనదిగాను, పరస్పరవిశ్వాస, ప్రేమానురాగ, చిత్తశుద్ధి, సద్భావములమీదనే మన హిందూ సంఘంలో వివాహవ్యవస్థ ఆధారపడియున్నది. ఇంకా యీ నాడు వివాహసంబంధములు చులకనగానున్నవి. అభ్యుదయం, పురోభివృద్ధి పేరుతో ఎన్నివేషాలు వేసి, ఎన్ని పోకడలు పోయినా చిత్తశుద్ధి, నైతికస్థాయి లోపాలవల్ల యీ నాటి వైవాహిక సంబంధములు మునుపటికంటె మెరుగైనవికాకపోగా అనిశ్చిత పరిస్థితులు ఏర్పడినవి.

హిందూ ధర్మం అనాదినుండి స్త్రీ పురుషులను క్రమబద్ధమైన, సుశిక్షణాయుతమైన జీవయాత్రకే ఆయత్తము చేయుచున్నది. దానినపాదార్థం చేసికొని విచక్షణారహితంగా కొందరు స్వార్థపరులు, ఛాందసులు వ్యవహరించిన ఫలితంగా శారదాచట్టము ఆ రోజుల్లో అవసరమయింది. శారదా చట్టం అమలులోనికి వచ్చినతర్వాత ఏ పరిస్థితులైతే మెరుగుకాగలవని యూహించబడిందో కాలక్రమాన అంతకుమించిన క్లిష్టసమస్యలు తలచూపినవి. ఆడపిల్లల వివాహవయో పరిమితి పెంచినతర్వాత వివాహసంబంధములు సమకూర్చుకొనుటలో తల్లిదండ్రులబరువు భారములు తగ్గలేదు. భార్యాభర్తలు మునుపటికంటె ఆరోగ్యసౌభాగ్యములు కలిగియున్నారనలేము. మునుపటికంటె వైధవ్యమునకు గురియైనవారు తక్కువయని అనలేము. పోనీ కలిగే సంతానమైనా మునుపటికంటె ఆరోగ్య, బలములుగలిగి ఉపయుక్తముగానున్నదా అంటే - అది చెప్పజాలము.

ఈ నాడు మాత్రం అవివాహితులైన ఆడపిల్లలు 25, 30, 35 ఏండ్లవయసువారు సయితము విరివిగా కనుపిస్తున్నారు. అట్టిది పూర్వకాలంలో లేదని ఆధారాలతో రూఢిచేయవచ్చును. ఈ నాటి ప్రజలలోని అభివృద్ధి అభ్యుదయాలు సకాలంలో ఆడపిల్లల పెండ్లిళ్ళకు తోడ్పడుటలేదేమో యనిపించుచున్నది. బాలవితంతువులకైతే పునర్వివాహములు చేసినా సబబనిపించుకుంటుంది కాని వయసుమీరిన వితంతువులకు వివాహములు తలపెట్టడం కంటె వారు పారమార్థిక, సేవా, త్యాగచితలతో జీవయాత్ర సాగించడం సంఘమునకే కాక వ్యక్తిగతంగా సయితము పవిత్రతను సమకూరుస్తుంది. ఇది గౌరవప్రదం, వాంఛనీయముకూడాను.

అఘాయిత్యము, అక్రమము, స్వార్థము, అవినీతితో సాగుతున్న మానవజీవయాత్ర వెనక్కు తిరిగి క్రమశిక్షణ, నీతి, నిజాయితీలు, పారమార్థికమువైపు పారజూచి దిద్దుకోక పోయినచో యింకావిచారకరమైన పరిస్థితులు, పరిణామాలు ఏర్పడగలవు. కాబట్టే సుశిక్షణ, నీతినియమాలు, నిజాయితీలకు విద్యావిజ్ఞానములలో ప్రాధాన్యమిచ్చి బాలబాలికలకు చిన్నప్పటినుండి తయారుచేసేవారు పూర్వము. దాని ఫలితంగా వారి జీవితం ఇహపరాలలో సుఖసౌభాగ్యముల కవకాశమని వారిభావన. తమబిడ్డల సుఖసౌభాగ్యముల నుద్దేశించి తలపెట్టే వివాహసంబంధాలు 12 ఏండ్లవయస్సులో చేసినా, 16 ఏండ్ల వయస్సులో చేసినా తల్లిదండ్రుల బాధ్యతలు ఒక్కే విధమైనవి కాబట్టి శారదా చట్టము ననుసరించైనా సాధ్యమైనంతత్వరలో ఆడపిల్లలకు వివాహంజరుగడం మంచిదని శ్రీ స్వాములవారి అభిప్రాయము.

శ్రీ శ్రీనివాసరావుగారి వాదననుసరించి నవీన నాగరకతా వాతావరణంలోని వివాహసంబంధములు పరస్పర విశ్వాస, ప్రేమానురాగాలతో సమకూరి వర్థిల్లుతున్నవనిగాని, అవి పదిలమైనవిగానున్నవనిగాని, సుఖప్రదములనుటకుగాని అవకాశ

ములు చాల స్వల్పమనునది వివాదరహితమైన విషయము. స్త్రీ పురుషులలో కష్టసుఖములని గ్రహించు శక్తికాని, ఓర్పుకాని నానాటికి తగ్గుతుండుటకు కారణము ఏమనాలనో! బహుశ యీనాటి అభ్యుదయ భావాలు, నడకకావుగదా!

పూర్వకాలపు ఆచారాలను, నమ్మకాలను గుడ్డెద్దు చేలోపడ్డట్టునమ్మి అనుసరించమని ఎవరు వాదించుట లేదు. కాని దేశకాలపాత్రల ననుసరించి మంచి చెడ్డలను గుర్తించకుండా అంతా ఆచరణ కనువైనది కాదని నిర్ణయించడం పొరబాటు. ఈనాడు ఆడపిల్లలకు సకాలంలో వివాహములు కానందుకు పూర్వాచారాలు, నమ్మకాలుమాత్రము కావు. అభివృద్ధి అభ్యుదయాల పేరుతో సంఘంలో అవాంఛనీయంగా వ్యవహరిస్తున్న స్వార్థపరులు మాత్రమే.

ఈనాడు వయస్సుమీరిన ఆడపిల్లలకు సకాలంలో వివాహములు జరుగకపోవుటకు వరకట్నాలపట్ల పేరాశ, యీడుజోడుఅయిన సంబంధాలు సమకూరకపోవుట కావచ్చును; కాని తల్లిదండ్రులు యీడుజోడుచూచి 12 ఏండ్ల వయస్సున ఆడపిల్లలకు వివాహములుచేస్తే వైవాహిక జీవితం యింతకు ముందు తృప్తికరంగా లేదనికాని, యికముందు తృప్తికరముగా నుండదనిగాని వాదించుట పొరబాటు.

బహు భార్యాతత్వం, బహుభర్తృతత్వం- రెండూ అవాంఛనీయములే, వీని నరికట్టడానికి చట్టములే అవసరమనుటకంటె ప్రజలు నీతి, నిజాయితీలకు కట్టుబడుటవలన చాలమేలు జరుగగలదు.

మతములు మానవకల్పితములేకావచ్చు. కాని అవి మానవ అభ్యుదయ అభివృద్ధుల నుద్దేశించినవిగాని వికటఅట్టహాసానికికాదు. అయితే కాలక్రమేణా వచ్చిన మార్పుల దృష్ట్యా మత ధర్మములను విశాల దృక్పథంతో పొరజూచి అర్థంచేసికోకుండా మానవులు వ్యవహరిస్తే ఫలితాలు అశాంతి, స్పర్ధలు, ద్వేషము యిత్యాదులయితే దానికి మతధర్మములు కాని, ప్రవక్తలుకాని కారణముకానేరరు. మతముల పేరుతో స్వార్థపరులుగాను, దుర్మార్గులుగాను రూపొందితే మానవలోకమే దానికి కారణము. మతముల దృష్టిలో స్త్రీలు బానిసలుగా భావించబడ్డారనడం తొందరపాటునే సూచిస్తుంది. హిందూమతం వరకు స్త్రీకి గౌరవప్రదమైనట్టి, పవిత్రమైనట్టి స్థానము నేయిచ్చింది. పురుషుడు చేస్తున్న ప్రతిపని యిప్పటిలాగ మునుపు స్త్రీలుచేయుట కవకాశము లేకపోవడం బానిసత్వానికి చిహ్నమని భావనచేస్తే నచో యీనాడు ఒకకుటుంబములో భార్యాభర్తలు ఎవరి యిచ్చవచ్చినట్లు వారు వేరువేరు మార్గాలలో నడుస్తుంటే కుటుంబపరిస్థితులు ఎలా పరిణమిస్తున్నవో చూడవలసియున్నది. అందుకనే పూర్వీకులు భార్యాభర్తలకు బరువు భారములను, బాధ్యతలను న్యాయంగా, సమానంగా విభజించి కుటుంబ సౌభాగ్యమునకు మార్గముచూపారు. మతములనేకాదు; పురాణేతిహాసములనుకూడ మానవ సౌభాగ్యమునకు విజ్ఞతతో వినియోగించుకుంటే స్త్రీ పురుషుల స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కుంటుబడ నవసరములేదు. ధర్మబద్ధమైన జీవయాత్రకు మతము ఏదైనా మూలసూత్రాలు ముమ్మాటికి తోడ్పడుచు నేయుండును.

శ్రీ స్వాములవారు స్త్రీలదైన్యావస్థకు సంబంధించిన సమస్యల పరిష్కారమునకు సంఘంలో వాస్తవిక పరిజ్ఞానము, మనోపరివర్తనము, సానుభూతి, సద్భావములు లేనిదే సేవాసదనంలాంటి సంస్థలు శాశ్వతంగా, తృప్తికరంగా పరిష్కరింపజాలవనడం శ్రీ శ్రీనివాసమూర్తిగారికి విడ్డూరంగా కనుపించినా అందులో యదార్థములేకపోలేదు. ఆదర్శ లక్ష్యాలను గురించి గంభీరోపన్యాసాలిస్తూ మత మూలసూత్రాల నవగాహనము చేసికోలేకుండా ఏ నాటినుండో స్త్రీలకు అపచారము చేసిన దంటున్న సంఘములోని వ్యక్తులకంటె మెరుగుగా నడచుకోలేని యీనాటి సంఘములోని వ్యక్తులు సంఘంలోని ఛీడను, కుళ్లును తీసెయ్యగలమని ఆర్భాటంచేయుటం భ్రమలాంటిది. వాస్తవిక పరిజ్ఞానం, మనోపరివర్తన లేకపోతే సేవాసదనంలాంటి సంస్థలుమాత్రము శాశ్వతముగా స్త్రీల సమస్యలను పరిష్కరించగలవని ఎలాగ నూహించడమో అర్థము కావడములేదు.

ఇక భగవంతుడే యిచ్చాడు - భగవంతుడే తీసికున్నాడనే భావము మానవునిలోనే లేకపోయినచో నేటికంటె రేపు మెరుగుగా నుండగలదనే ఆశాకిరణాలకే అవకాశముండదు. ఆయాశా కిరణములే లేకపోయినచో మానవుడు నిరాశ, నిస్పృహలతో ఒక్క అడుగైనా జీవయాత్రలో ముందుకు వేయలేడు. నుప్పకూలిపోయిన మానవుడు కటికచీకట్లో లీనమైపోవలసినదే. పైగా భగవంతుని ప్రసక్తియే లేక ఘనతఅంతా తనదే; తానను భవించె సుఖ సౌభాగ్యములు స్వయంగా తనవల్ల నిర్మితములయిన

వనే భావం ప్రబలితే స్వార్థానికి, స్వాతిశయానికి, అహంకారమునకు పరిమితులంటూ యుండవు. దాని ఫలితములు మరింత ప్రమాదభరితములు. నూటికి నూరు పాళ్ళు అన్యాయం, అక్రమం ప్రబలుతవి. ఇది వాంఛనీయమని ఎవరనగలరు? కాబట్టే మానవజీవ యాత్ర సుఖదుఃఖాలలో సుగమం కావడానికి భగ వంతుని స్ఫురణలో నుంచుకోవలసియున్నది. భగ వంతునికి జడిసైనా మానవుడు అహంనుచంపుకొని క్రమబద్ధమైన, నీతి నియమాలతోకూడిన జీవయాత్రను రూపొందించుకుంటాడు. జీవయాత్రలో నిరాశ నిస్పృ హలు ఆవరిస్తున్నా స్వధర్మ నిర్వహణను ఏమరక నేటికంటె రేపు మెరుగుగా నుండగలదేమోనని ముందుకు నడుస్తాడు.

ఏదెట్లున్నా కుటుంబసౌభాగ్యము నుద్దేశించిన విద్యావిజ్ఞాన, సుశిక్షణలు బాలికల కత్యంతఅవసరము. వాని ననుసరించి సకాలంలో బాలికలకు వివాహములు జరుగవలసియున్నది. అందుకుగాను ప్రజాబాహు ళ్యము ఆశక్తి చూపవలసియున్నది. ఇది జాతీయ విశిష్టత కెంతైనా తోడ్పడగలదు.

— పున్నయ్య.

—o—

# అంకురార్పణ

"సస్యశ్రీ"

—o—

ఊయుముల భేరీలు, మెఱపు దీపాలు,
పాడుకోరా, పెళ్లి పందిటిలోకి
తల్లి తొలకరితోటి తరలి వచ్చింది,
ముఖసిరు లీనగా మృగశిరా కన్య;
నేలనల్మూలలా పాలికల్విచ్చి,
నీ పురోహితునిగా నిలిచెను ప్రకృతి;
అంకురార్పణ వేళ ఆసన్నమయ్యె
కంకణ మూని, సంకల్పించు సుకృతి ;
ఫల దేవతకు బీజ ప్రాణప్రతిష్ఠ,
హాలపరిగ్రహణాని కంకురార్పణము,
సలుపరా పాడి పంటల పెండ్లికొడుక
నవ 'సస్యశ్రీ' లతో నవ్యాంధ్ర సీమ.

# మనోరథం

"లతిక"

—o—

పూజలు చేసెను
పాప కోసమై
పట్టెను నోములు
పాప కోసమై

నిద్దురలో కను
మధుర స్వప్నాలు
పలు రాత్రమ్ములు
పాప కోసమై

నిర్మించెను భా
వాల సౌధములు
భవిష్యత్తులో
పాపకోసమై

తాను చేసెను
దీర్ఘ నిరీక్షణ
జన్మకు వరమని
పాప కోసమై

వరమిచ్చిరి తా
మొక్కిన వేల్పులు
ఫలమిచ్చెను తా
పట్టిన నోములు

నిజమైనవి తను
కన్న కలలన్ని

నిలిచెను స్థిరముగ
గాలి మేడలే!

కలిగింది వరము
కల కాలమునకు
అంత మందింది
దీర్ఘ నిరీక్షణ

వనితా మనోరథం
తీరింది ఒకపాప
పుట్టింది, బ్రతుకులలో
వెల్గింది ఒక జ్యోతి!

అంతిరించాయి
అంధ కారాలు
వెల్లి విరిసాయి
వెల్గు కిరణాలు

నాతి బ్రతుకులో
ప్రసరించిన వెలుగు
నవీన కాంతిని
కిరణ పుంజాలు

వెలుగులో వనిత
జీవన శకటం
నడచె నెట్టి ఒడు
దుడుకులును లేక!



# బ్లా లెటర్

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావు B. A.



(గతసంచిక తరువాయి)

ఏగాదిగా చూశాడు కృష్ణారావు, ఎక్కడినుంచి వచ్చిందండీ అంటూ అనసూయవచ్చి అడుగుతూంది. అదే చూస్తున్నాను. ఇదిగో మన మద్రాసునుంచే లోకలు పోస్టు, అన్నాడు బాహాటంగా కృష్ణారావు. ఎవరండీ వ్రాసింది? అని అడుగుతూండగానే కృష్ణారావు గబగబా ఆ బ్లూకవరునుంచి లోపల వుత్తరాన్ని తీసి చూశాడు. కళ్లు నమ్మలేకపోతున్నాయి. ముత్యాలు మూటకట్టేదస్తూరీ! అమృత గుళికలువంటి మాటలు. పండిన ఫలం! నిజమైన స్వప్నకథ! హద్దులులేని ఆనందం! ఎక్కడున్నదీ తెలియటంలేదు. మనిషి యెదురుగా నుంచుని మాట్లాడుతున్నట్లువుంది వుత్తరం. వెన్నపూసలాంటి మనసు! ఏమో అనుకున్నానూ! అని ఆ వుత్తరాన్ని అప్రయత్నంగా గుండెకి హత్తుకున్నాడు కృష్ణారావు — పరవశత్వంతో.

అదేవిటండీ - అలావుత్తరాన్ని కౌగలించుకుంటారు? ఆడాళ్లు వ్రాశారా? అని అడిగింది ఆశ్చర్యంగా అనసూయ.

ఆనందం ఒకప్పుడు చాలా ప్రమాదాన్ని చూపెడుతుంది. అనసూయ ఎదురుగుండావుండగానే యింతపని చేశాను — యేంచెప్పకోను — నా తెలివి అని 'మమ' అనుకొని లెంపలువేసుకున్నట్లు బుద్ధి చెప్పుకున్నాడు కృష్ణారావు. ఇంతలోనే మళ్లీ అడిగింది అనసూయ. అదేదయినా రహస్యం వుత్తరమా? అని. అబ్బే - రహస్యానికేముంది. మా ఆఫీసుగాడవలే! యిది! ఒక స్నేహితుడు రాస్తూన్న స్టైలుచూసి — ఆవ్యవహారం తెగిన ధోరణిమాసి - బురదలోంచి బైటపడ్డట్టుంది అనసూయా! అన్నాడు కృష్ణారావు దబాయింపు మాటలతో.

అలాగయితే ఏ వూరి స్నేహితుడండీ యీయన? అంది మళ్ళీ అనసూయ. అబ్బే - విజయవాడ! అన్నాడు ధపీలుమని, మరి - మద్రాసునుంచి వచ్చిందన్నారుగా యిందాకా - లోకలుపోస్టు అన్నారుకూడా, ఇప్పుడు యిలా అంటున్నారే! నిజంచెప్పండీ! నన్నాడించటం దేనికీ! ఇలా యివ్వండి నేనే చూసుకుంటాను - అని అనసూయ అడిగేసరికి కృష్ణారావు కొంచంకంగారు పడి - తనతప్పును కప్పి పుచ్చడానికని విజయవాడ ఫ్రెండుకే - లోకలు పోస్టు! పోతూపోతూ రాసి పోయాడు, అనసూయా — ఆఫీసు విషయాలు ఆడాళ్ళకేందుకు చెప్పు? ఎన్నో రహస్యాలుంటాయి. ఆడదాని నోటిలో నువ్వు గింజకూడా ఆగదుగదా! అని సముదాయించి - భోంచేసి — డ్రస్సువేసుకొని కొండెక్కి పిండికొట్టినట్లు గర్వంతో - కృష్ణారావు ఆఫీసుకు పోతున్నాడు.

అలా ఆనందంగా పోయే కృష్ణారావుని చూసి- తలపంకించి ఒంటివేలును ప్రశ్నార్థకంగా వూపుతూ - యింతేగామగాళ్లు! అని హేళనచేసి- చూద్దాం! అని తానూ సంతోషంగా వంటింట్లోకి పోయింది అనసూయ.

ఆఫీసులో అడుగు పెట్టేసరికి రోజా మునిమునినవ్వులతో తన పక్కనుంచే పోవడం కృష్ణారావు కనిపెట్టాడు. తన్నుతానే మరిచి పోయాడు, వుత్తరం అందిందికదూ! అనేనా ఆ మునిమునినవ్వుల తాత్పర్యం! అనుకున్నాడు కృష్ణారావు. అతను మాత్రం వూరుకున్నాడా—చిన్న చిరునవ్వు— చిద్విలాసంగా వదిలాడు, ఇదంతా చూస్తున్నారు తోటిగుమాస్తాలు - ద్వేషంతో - రోషంతో!

కృష్ణారావుకి ఆఫీసులో తోచటంలేదు. ఆ బ్లూలెటరుని ఫైల్సులో పెట్టి చదువుతున్నాడు. ప్రతి అక్షరాన్నీ పదిసార్లు చదువుకుంటున్నాడు. లోలోపల మురిసిపోతున్నాడు, రోజా లేఖ రోజాలాగే గుబాళిస్తోంది. మతి పోగొడుతోంది. ఇంకేం చేస్తాడాఫీసులో.

అంతా లంచికి పోయారు. కృష్ణారావు కూడా విడిగా ఒక యిన్లాండు కవరుమీద చలాకీగా వ్రాస్తున్నాడు. పెదిమలుకొరకడం - కనుబొమ్మల్ని మీటడం _ ఒక్కొక్కసారి ఆలోచించడం - వంటి దశావతారాల్ని చూపెడుతున్నాడు కృష్ణారావు. మొత్తానికి వుత్తరం పూర్తిచేశాడు. తృప్తిపడ్డాడు. యడ్రస్సు ఎందుకనో కట్ చేసింది — రోజా! అనుకుంటూ గొణుక్కున్నాడు, కాని ఆలోచించి - అదీ ఒక వుపాయమే. రహస్య ప్రేమలేఖల్ని విత్తనాల దశలోనే బహిరంగ పఱచడం వివేకం కాదుగదా! అనుకున్నాడు. రోజా C/o పోస్టు మాస్టరు అని యడ్రసు వ్రాసి తానే స్వయంగా పోస్టుచేశాడు.

సాయంత్రం యింటికి వచ్చేసరికి కృష్ణారావు అదోమాదిరిగా వుండడం అనసూయ గ్రహించక పోలేదు. అంతా ఆలోచనమయం. పరధ్యానం. లోలోపల ముసిముసినవ్వులు. ఏదో వ్యక్తపఱచలేని తృప్తి. తిండిమీదగాని - తిరుగుడుమీదగాని - వేషభాషలమీదగాని - డెకరేషను మీదగాని అతనికి తహతహ లేదు. అంతా చూస్తూంది అనసూయ.

ఆ రాత్రి అనసూయ చూస్తూంది భర్తను నిద్ర పోతూంటే. కృష్ణారావు కలవరింతలు. అస్తమానం రోజా! రోజా! అనడం. అనసూయ తిట్టిలేపింది, ఏమిటండీ కలవరింతలూ మీరూనూ. ఎక్కడైనా దడుసుకున్నారా? అని అడిగింది. చ. ఛా! చిన్న పిల్లాడినా? దడుసుకోవడానికి? గడ్డం మీసం వచ్చిందే _ దేవుడు కనికరించలేదుగాని _ ముగ్గురు పిల్లల తండ్రిని కావలసిన వాడిని _ నేనెందుకు డడుసుకుంటాను _ అనసూయా! అన్నాడు. అది కాదండీ _ అస్తమానం కలవరించడం. రోజా! రోజా! అనటం ఏవిటో అయోమయంగా వుందండీ! అంది అనసూయ. అదా! యివాళ సాయంత్రం వచ్చేటప్పుడు రోజాలు తెచ్చి నీ సిగని సింగారిద్దామనుకొన్నానులే. ఎక్కడా దొఱకలేదు. నిద్ర పోతూ _ పోతూ నా "అనూ"కి రోజాలు తేలేకపోయానే! అనుకున్నాను. పడుకోపోయేటప్పుడు యేమనుకుంటామో _ అవేకలలుసుమా! ఇంతేందుకు? ఈ రోజాలే ఎలా కలలోకివచ్చాయో చూడు! అని దబాయించాడు అనసూయతో. కాని ఆవిడ మాత్రం నమ్మిందికనకనా. వూకొట్టి వూరుకుంది. కొంచెం నిద్రనాటకం నడిపిస్తూంది అనసూయ. కృష్ణారావుకి మరి నిద్రలేదు. కిటికీలోంచి చూశాడు. నీలాల రింగితో పొంగిపోతున్నాడు చందమామ. నైటుక్వీను సువాసనల్ని కురిపిస్తోంది. దూరాన _ ఎవడో తంబురామీటి తత్వగీతికపాడుతున్నాడు. వెన్నెలరాత్రి - ఎలక్ట్రిక్ దీపాలు ఆరిపోయాయి. కృష్ణారావుకి తోచటంలేదు. రోజాకి బదులు రాశాను. తెల్లారితేగాని అందదు. వెంటనే జాబువ్రాస్తానంది. బ్లూలెటరే వ్రాస్తానంది. ఆనవాలువుంచుకోమంది. ఆవేశపడవద్దంది. అనురాగం వర్ధిల్లాలంది. ఆనందం వర్షించాలంది. అమర ప్రేమ సాధించాలంది! ఎంత సిసింద్రీపిల్ల - అనుకుంటూ కృష్ణారావు టేబిలు దగ్గఱకుపోయి_ఆ లెటరుని - ఆ బ్లూలెటరుని తఱిచి తఱిచి చదువుకుంటున్నాడు. అనసూయ - హఠాత్తుగా లేచి - కృష్ణారావు దగ్గఱకు పోయి - ఇదేవిటండీ? యీ నీలిరంగు వుత్తరాన్ని యింతగా చదువుతున్నారు_ మరీ చిత్రం _ ఏది నన్ను చూడనివ్వండి - అందులో వున్నదేవిటో అసలు? అంది. పెద్ద పెద్ద సమస్యలు గల యీ ఆఫీసు వుత్తరం అంత తేలికగా అర్థం కావటంలేదు అనసూయా! ఒకే మాటకి అనేక అర్థాలువచ్చేటట్లు వ్రాశాడు నామిత్రుడు _ వీడిల్లు బంగారంగాను ట్రిపిల్ M.A.లే. కొంచెం ఎనాలిసిస్ సింథసిస్సూచేసి నిగ్గుతీస్తున్నా అన్నాడు కృష్ణారావు. అనిగ్గేదో _ తెల్లారాక తీయచ్చు కాని యింక_పడుకోండీ! అంది అనసూయ. తప్పనిసరిగా పవళించారు.

ఆ మర్నాడు కృష్ణారావు ఆతురత యింకా పెరిగింది. ఆఫీసులోనూ అంతే, ఇంట్లోనూ అంతే. తొందరగా తెల్లారాలి. వెంటనే పోస్టురావాలి రోజా ప్రేమ లేఖ అందుకోవాలి. వస్తూ _ వస్తూ పోస్టుమాస్టర్ని కలుసుకున్నాడు కృష్ణారావు. ఏవండిసార్ _ రోజా C/o పోస్టుమాస్టరు అని వుత్తరాలు వచ్చాయా మీ దగ్గఱకు అని అడిగాడు. ఆహాఁ అన్నాడు ఆ పోస్టుమేష్టారు. ఎవరైనావచ్చి డెలివరీ తీసుకున్నారా? సార్? అని వెంటనే అడిగాడు కృష్ణారావు. శ్రీమతి

రోజాగారే వచ్చి స్వయంగా తీసుకున్నారండీ అన్నాడు పోస్టుమేస్టరు. ఎప్పుడు సార్ - తీసుకుంట? అన్నాడు కృష్ణారావు. ఒంటిగంటకు వచ్చి తీసుకున్నారండీ? అన్నాడాయన. కొంపతవ్వింది! ఒంటిగంటకు రోజా ఆఫీసులోనే వుందిగా! ఎలా తీసుకుంది? రోజా పేరు చెప్పి మరెవరైనా తీసుకున్నారా? ఈ బ్రహ్మరహస్యం మా ఆవిడ గ్రహించి అనిదే తీసుకోలేదుకదా! అని అతని మనస్సు ఆలోచనతో - ఆందోళనతో ఉయ్యాలలూగింది. కొంచం మనవిసార్! అన్నాడు కృష్ణారావు పోస్టుమేస్టరితో. ఏవిటది! అన్నాడు ఆయన. ఏమీలేదుసార్ - ఆవిడ ఎలావుంటుందంటారు? అని అడిగాడు కృష్ణారావు. ఎలా వుండటం యేవిటి అచ్చు రోజాలాగేవుంటుంది. అన్నాడు ఆయన. తమరు శ్రీమతి రోజాను ఎఱుగుదురా సార్ అన్నాడు కృష్ణారావు, ఎఱుగుదునండీ - యీలాంటి యడ్రస్సుగల వుత్తరాలు వస్తాయి - భద్రం అని ముందేవచ్చి చెప్పిందండీ! అన్నాడు పోస్టుమేస్టరు. ఇంక ఫరవాలేదు. మన ప్రేమలేఖ భద్రంగానే అంది వుంటుందని ధీమాగా యింటికి వచ్చాడు కృష్ణారావు క్రితంసాయంత్రం. ఆతురతలో ఎదురుచూస్తున్నప్పుడు పనిగట్టుకొని ఆలశ్యం అవుతూంటయి కొన్ని. మనం వెళ్లాల్సిన రైలు లేటయినట్టుగా, గడియారం మాత్రం నిజాయితీగా తొమ్మిదికొట్టింది. పోస్టుమేను వస్తేగా కృష్ణారావుకి అనుమానంవేసింది. కొంపతవ్వి రోజా రెక్లెస్‌గా యీ ప్రేమలేఖను తలుపులులేని బీరువాలో వుంచలేదుకదా! అలా వుంచగా ఏ ఘటోత్కచుడూ తలపంకిస్తూ చదవలేదుగదా! అలా బయటపడితే - ప్రణయప్రళయం ఎంతవఱకూ వ్యాపిస్తుంది? అని అనుకోగా వాడిల్లు బంగారంగానూ! పోస్టు అంటూ చక్కావచ్చి బ్లూలెటర్ కృష్ణారావు చేతిలోవుంచి అన్ పెయిడ్ లెటరు సార్ అంటూ అరునయాపైసలు వసూలుచేసుకుపోయాడు. పుట్టె మునిగినట్లు ఉత్తరంచించి కృష్ణారావు చదువుతూండగానే అనసూయతయారు. అమాయకంగా ఆ ఉత్తరంలో లీనం అయిపోయాడు. కృష్ణారావు. డిస్టర్బు చేయకుండా దర్జాగానుంచుని చూస్తుంది ఆ ముఖభావాలను - అముద్రరాలు. ఉత్తరం చదువుతూ కృష్ణారావు చూపే ఆ ఆనంద ప్రకటన చూచి పకపకనవ్వింది అనసూయ. అధ్వానికి అంత మనిషీ అదరీ - ఏమిటూ వెకిలినవ్వూ! అన్నాడు కృష్ణారావు. అంత ఉడుకుబోతుతనం ఎందుకండీ - యీ బ్లూలెటరు గొడవఏవిటి అని అడిగానా? రోజు విడిచి రోజువస్తున్నాయి! ఏవిటిది? అన్నాను కనకనా? నవ్వురావడంతప్పా? నవ్వితే తప్పా? ఏడుస్తూవుండమంటారా? ఇల్లాలు కలకలలాడుతూంటే యింటికే జయం అంటారుగా! అంది సాగతీస్తూ అనసూయ. సీరియస్‌గా ముఖంపెట్టి! ఆడాళ్ళకేం తెలుస్తాయి ఆఫీసు గొడవలు. పాలిటిక్సు తెగపెరిగి - ఆఫీసంతా అయోమయంలాగ చీకటడవి అయిపోతోంది. యీ ఉత్తరంలో ఏముందో తెలియక అలా నవ్వుతున్నావ్ - అన్నాడు కృష్ణారావు. మొన్నటి బ్లూలెటరులో యేంవుందో - దాని బ్రాటోవరే యిందులో వుంటుందిలెండి - అంది! అనసూయా. అంతేలే! అన్నాడు కృష్ణారావు అప్రయత్నంగా.

అయితేకాని - యిలా చూడండి! అంది అనసూయ. ఏం అన్నాడు కృష్ణారావు. ఏమీ లేదు. ఇవాళ మా ఫ్రెండు పేరంటానికి పిలిచింది. సాయంత్రం ఆరుగంటలకి; నాలుగింటికే యిల్లు బయలుదేరి - మధ్యదారిలో మా వదినగారింటికి పోయి పేరంటం ముగించుకొని వచ్చేసరికి రాత్రి ఏడుగంటలవుతుందేమో! యీ రెండో తాళం చెవి మీదగ్గఱవుంచుకుంటారా? అంది అనసూయ.

వెరీగుడ్! అలా చెప్పవేం! నాకూ చిన్నపని వుంది సాయంత్రం. ఇంటికివచ్చేసరికి రాత్రి ఎనిమిది కావచ్చు. అలాంటప్పుడు నువ్వే నాకన్న ఓగంట ముందుగా యింటికి వస్తావ్. మొదటి తాళంచెవీ - రెండోతాళంచెవీ నీదగ్గరేవుంచుకో! అన్నాడు కృష్ణారావు.

అంత ఎనిమిదిదాకా - యేం రాచకార్యాలున్నాయి బాబూ! పెందరాళే రాకూడదూ, ఎక్కడ చూసినా దొంగతనాలుట! అంది అనసూయ.

నీకేం తెలుస్తుంది అనసూయ మగాళ్లగొడవలు. ఇండియాలో యింకా ఆడాళ్లు రిఫార్మ్ కావాలి. మొగుడుతోపాటు ఆడదీ ఆఫీసుకుపోతే ఆర్జనలో వుండే - ఆఫీసుల్లోవుండే అష్టకష్టాలూ అవగాహన అవుతాయి. రెక్కలాడించుకుంటూ ఒక్కడే సంపాదించడం, చక్కగా మిగతావాళ్లు మెక్కడం, కాయకష్టం ఒకళ్లదీ - భోగజీవనం మిగతావాళ్లదీ - యేం చెప్పమంటావ్! అన్నాడు కృష్ణారావు.

సరేలెండి ఆ గొడవలన్నీ నాకెందుకు! అంటూ

అనసూయ వెళ్లింది. భోంచేసిదర్జాగా - కొత్తరకం పోజుతో - పెద్దసైజు ఆనందంతో కృష్ణారావు ఆఫీసుకుపోయాడు. రోజా విశేషంగా చిరునవ్వు బాణంవదిలింది. ఆడదానికే దాసుడయ్యాడు బ్రహ్మదేవుడు, అందుకనే మగాళ్ళనికూడా వాళ్లాగే దాసులు కమ్మన్నాడు. ఆ వాలుచూపులముందు యే యాటంబాంబులు ఆగుతాయి. ఆ సింగారాల సిసింద్రీ ఓరచూపుతో - మందస్మితంతో - ఆ నవ్వీన నవ్వు - చూడడానికి చిన్నదయినా అర్థంతో తాత్పర్యంతో ఎన్నో డిక్షనరీలకు పనిచెబుతుంది - అనుకున్నాడు కృష్ణారావు.

అంతా లంచికిపోయారు. ఫైల్సుమధ్య బ్లూలెటరు. అక్షరాల్ని ఆరాధిస్తూ - ఆనందంగా కృష్ణారావుగారి మానసపఠనం. సాయంత్రం ఆరు గంటలకు - ట్రిప్లికేను బీచివద్ద సమావేశం, మనసులు విప్పి మాట్లాడుకోవడం, ప్రణయప్రణాళిక తయారు చేసుకోవడం. సుముహూర్తం. ఫలానాచోటు! అని అనవాలు! యింకేంకావాలి. తపస్సు ఫలించింది: తమస్సు విడిపోయింది: హాయి! హాయి! అనుకుంటూండగానే చరచరా ఆఫీసు మూతపడే గంటలు సమీపించాయి. మరికొంత సేపటికి తనకిన్నముందు రోజా తనవైపుచూస్తూనేపోయింది. తెలుసునుగా కార్యక్రమం, తానూ ఆఫీసువదిలాడు. వదిలే ముందు పర్సుచూసుకున్నాడు. కొంతడబ్బు స్నేహితుణ్ణిఅడిగి తీసుకున్నాడు. బస్సులోపోతే యిన్సల్టు, ఆటోరిక్షాఅయితే బిందుదర్జావుండదు. బేబీటాక్సీ - యీనాటి కార్యక్రమానికి ఎంతో ఠీవి అనుకున్నాడు. అక్షరాలా బేబీటాక్సీలో ట్రిప్లికేను బీచికి పోతున్నాడు కృష్ణారావు. మధ్యలో సెలూన్ కి పోయి హెయిర్‌డ్రస్సు చేసుకుని - టాయిలెట్ చేసుకుని - యింకోచోట కారుఆపి మంచి సిల్కుచీర కొన్నాడు. ఫ్లవరు మార్కెట్టులో రోజాని అలంకరించడానికి పెద్ద దండవొకటికొన్నాడు. అత్తరులతో ఘుమఘుమలాడుతూవున్న ఆకృష్ణారావు కొత్తపెళ్ళికొడుకులావున్నాడు. సరిగ్గా రోజాచెప్పిన అనవాళ్ళప్రకారం టాక్సీనిపోనిచ్చాడు. మీటరుప్రకారం డబ్బుయిచ్చి టాక్సీని పంపించాడు. సిమెంటు బెంచీనిదులిపి సిగరెట్టువెలిగించి - కూర్చుని అలా సముద్రంవైపు చూస్తున్నాడు. కొత్తఊరిస్తుంది, పాత విసుగెత్తిస్తుంది. విరాగంతో పాతలో జీవితాన్ని పాతచేసుకుంటారు కొంతమంది. నావంటి రసికులు కొత్తతోపలుకుతూంటారిలాగ, భోగంకూడా జాతకబలం అని అనుకుంటూ తలెత్తిచూసేసరికి బ్రదరిన్లా అంటే బావమరిది. గుడీవినింగులు కొడుతున్నాడు ప్రశ్నమీద ప్రశ్నవేసి విసుగెత్తిస్తున్నాడు. రోజా వస్తానన్న టైమయింది: ఈ పిశాచంపోడే. పైగా ఆకళ్ళు చీరమీదకీ-ఆపూలదండమీదకీ పోనిచ్చాడు. పోనిచ్చి వూరుకుంటేగా ఎవరివి? ఎందుకు? అంటున్నాడు! మీదిమీదికివచ్చి ఆచీరనివిప్పి బావుందీచీర మాచెల్లాయియేదంటాడు! పాపం - కృష్ణారావుకి పెద్ద ఆశాభంగం. ఈఘటం కదిలేటట్టులేదు. బతికించింది రోజా ఆలస్యంచేయడంవల్ల నా పరువు నిలబడింది. ఆవిడివస్తేనేను-నాపరువూ యీబంగాళాఖాతంలో కుంగినట్టే అనుకుంటున్నాడు కృష్ణారావు, బ్రదరిన్లా వూరుకున్నాడా! తిష్ఠవేసి బాతాఖానీ లంకించుకున్నాడు,రోజా మంచిముహూర్తమే సెలెక్టుచేసింది. వట్టియమగండంకాలం. అయినా కిరస్తానీవాళ్ళకీ రాహుకాలం-యమగండం ఎందుకులే, అనుకుంటూ రోజావస్తానన్న టైముదాటింది. వీడువదలడు, ఏం చేసేదిరా! అనుకుంటున్నాడు కృష్ణారావు. ఈ చీర మాచెల్లెలికేనా! చాలాబావుంది సుమా! వెలయెంత! అంటూ బ్రదరిన్లా బాతాఖానీ బ్రహ్మాండంగా పొడిగించాడు. కృష్ణారావుకి తలనొప్పి హెచ్చుతూంది. తానొకటితలిస్తే దైవం యింకొటి తలుస్తాడంటారు యింతే. ఈ కీచకుణ్ణీ, నన్నుచూసి రోజా యింకేంవస్తుంది! అని డీలాపడ్డాడు కృష్ణారావు. ఉపాయంతో వీడిపీడ తప్పించుకోవాలని కకృష్ణారావుయత్నం. బావా! అలావెళ్ళి ఒకపెకెట్ సిగరెట్టుపెట్టి తెచ్చిపెడుదూ అని కృష్ణారావు రూపాయనోటు యిచ్చాడు బావకి. బావ అలా పోగానే కృష్ణారావు అసిమెంటు బెంచీవదలి యెక్కడికో పోతున్నాడు. బావవచ్చేసరికి అక్కడలేడు కృష్ణారావు. బావమాత్రం తక్కువా! అంతాగాలించి ఆఖరుకు కృష్ణారావుని పట్టుకున్నాడు. మళ్ళీ అక్కడా ఆరంభించాడు బావ తన బాతఖానీ. కాని ఖూనీగావుంది కృష్ణారావుకి.

దూరాన్నుంచి వస్తోంది ఒక వయారిభామ. అచ్చు రోజాలాగేవుంది. బీచ్‌లైట్లు వెలుగుతున్నాయి - ఫేలయిన విద్యార్థిముఖంలాగ. ముఖంకనిపించక్కపోయినా - అందాలుచిందే ఆ సింగారం- అనడక ఆట్టాకూ . టీకుచూసి - వెరీగుడ్! రోజాసిగ్నలే- యివి అని ఆనందిస్తూ - ఓసారి బావవైపుచూసి ఆవదంతాగిన ముఖంపెట్టాడు కృష్ణారావు. బావకూడా ముఖంముట్లించి నోరుతెలవేశాడు. ఆసుందరి

పెషావరు స్పీడుతో వస్తోంది. ముఖం కినీదలావుంది. చలాకీతనం పరుగులెడుతోంది. ఆవిడ కృష్ణారావు వైపే వస్తోంది. బావ గొంతుకమార్చి - ఆవిడ ఎవరు యిలావస్తోంది! సికోసమా - నా కోసమా? అన్నాడు. ఆవిడ రమ్మని తప్పట్లుకొట్టి సైగచేస్తోంది. కృష్ణారావునే వుద్దేశించి. ఈ బాపతు సావాసం కోసమా యీ బిచికిగోవడం - యీ చీరలుకొనడం. యీ పూలమాలలు పట్టుకోవడం! చెబుతానుండు మాచెల్లెలితో అన్నాడు. బావ అవసరమైతే అయిదు రూపాయలిచ్చిగో తీసుకో_అల్లరిమాత్రం చేయకు _ బావవుకదూ అన్నాడు. కృష్ణారావు. తెగతప్పట్లు కొడుతూ_దబ్బున రమ్మంటుంది ఆనిసింద్రీ: లంచం అంటే నాకు డోకు. లంచగొండితనాన్ని కూకటి వేళ్ళతో నిర్మూలనం చేయడానికి సి. ఐ. డి లకు మనం బలం. అవినీతిని అరికట్టడం నాకు ఆనందం_ అన్నాడు బావ. ఆవిడ తిప్పట్లుకొడుతూంది. వీడు చెప్పినమాటవినడు.చిక్కగావుంది. చొఱవచేసి కృష్ణారావు ఆవిడ్దిదగ్గఱకు పోతున్నాడు_చీరతో_పూలమాలతో! బావా! బావా! అంటూ వెన్నంటాడు బ్రదరిన్లా. ఆవేశంలో - ఆకీనీదలా_ఆవిడ మెడలో పూలమాలవేశాడు కృష్ణారావు. వెరీగుడ్ అని తప్పట్లు చరిచాడు, వెనకాతలేవచ్చి బ్రదరిన్లా. చప్పున-చీరను చేతిలోవుంచాడు కృష్ణారావు. యేమనుకోకు రోజా! ఇది ప్రథమ పరిచయసమయంలో నా బహుమానం_ అని కృష్ణారావు అంటూంటే - రోజా! ఎవరు రోజా! అని బ్రదరిన్లా అంటూంటే- అది బ్లూలెటరు రోజా! నీకేం తెలుస్తుంది అన్నయ్యా - అని ఆ ఆడ గొంతుక. ఆఁ ఎవరునువ్వు? యిలా వెలుతురు లోకిరా! అన్నాడు కృష్ణారావు, అరే! మా అనసూయ! యేలావచ్చింది? అన్నాడు బ్రదరిన్లా.

అందరం చీకటిలోంచి వెలుతురులోకి పోదాం రండి! అంది అనసూయ. ఇన్నేళ్ళువచ్చి యిదేంపని! అన్నట్టు కురకురచూశాడు బావ. వేసినదండ అలాగే వుంది. కొత్తచీర ధగధగ మెరుస్తూంది. అదో మాదిరిగా కృష్ణారావు అగాధంగా ఆలోచిస్తున్నాడు. ఫరవాలేదండీ! బాధపడకండీ! అంది అనసూయ. బేబీటాక్సీలో ముగ్గురూ యిల్లుచేరుకున్నారు. ఎందుకు బావా! యిదవుతావ్! అని బ్రదరిన్లా ఓదార్చాడు. రాత్రి నిద్రపోలేదు కృష్ణారావు. మర్నాడు ఆఫీసుకు పోయాడు, అదేసమయంలో రోజా "పెళ్లిపిలుపు" శుభలేఖల్ని అందిస్తూ తప్పకరండి నాపెళ్ళికి అంటూంది. అంటూనే కృష్ణారావుకికూడా యిచ్చింది.

బ్లూలెటర్ మాట అడిగి యిందేంపని అందామనుకొన్నాడు, కాని వీలుచిక్కలేదు. తిరిగి సాయంత్రం యింటికిపోయేసరికి_ కృష్ణారావు తండ్రి యీజీచైరులోవున్నాడు. డ్రమెటిక్ పోజులుపెడుతున్నాడు బ్రదరిన్లా.

మీ అబ్బాయిగారి ప్రణయలేఖలు అంటూ ఉత్తరాలకట్టతెచ్చి దగ్గరవుంచింది అనసూయ. కన్నీటిచుక్కలు ముత్యాలలాగ పడుతున్నాయి, కృష్ణారావు తెల్లబోయిచూస్తున్నాడు యిదంతా? బ్లూలెటరుతెచ్చిన భూకంపం అనుకొని తన ప్రళయప్రణయాన్ని తలుచుకొని తన అపరాధాన్ని గుర్తించి లెంపలు వేసుకున్నాడు కృష్ణారావు ఆ బాత్ రూమ్‌లో.

కందిపోయిన ముఖంతో - వచ్చేకోపాన్ని మింగుతూ ఆ ముసలితండ్రి - కొడుకునుచూచి_ఏమిరా! అబ్బాయీ! పుచ్చపువ్వులాంటి వంశానికి మచ్చ తెస్తావురా? ముదివయస్సులోవున్న నన్ను ముప్పుల్లో ముంచుతావా? యిదేనా నీచదువులసారం? అని కోపించి - కొడుకు చెయ్యిపట్టుకొని వేరుమన్నాడు ఆ వృద్ధమూర్తి.

నాన్నా! క్షమించు. బాధపడకు. ఇదితుదిసారం. ఇలాంటిది నాకంఠంలో ప్రాణం వున్నంతకాలం జరగదు, నీకు అశాంతి కలిగించినందుకు మన్నించు నాన్నా. గతాన్నిమరిచిపో, నన్ను క్షమించు నాన్నా! అన్నాడు దీనంగా కృష్ణారావు.

బాధపడకండి మామగారూ అంది అనసూయ - ఆ బ్లూలెటర్లను అగ్గిపుల్లతో అంటిస్తూ.

# ప్లాస్టిక్కుల పుట్టు పూర్వోత్తరాలు
# వాటి బహుళ ప్రయోజనాలు

—(౦)—

నేడు ప్లాస్టిక్కులు ప్రజా జీవితంతో పెనవేసుకొని ఉన్నవి. గృహాలలో, పనుల్లో, ఆటల్లో – అంతటా ప్లాస్టిక్స్ మయమే. ప్లాస్టిక్కుల బహుముఖ ప్రయోజనం ఆశ్చర్యం కలిగిస్తుంది. చిన్న సీసా తయారుచేయటానికి ఉపయోగపడే ప్లాస్టిక్కు పదార్థం ఉపరితల వాతావరణ పరిశోధనకు పెద్దపెద్ద గాలి గుమ్మటాల నిర్మాణానికి సైతం పనికివస్తుంది. ప్లాస్టిక్కు సామాన్లను ఉక్కు అంత గట్టిగానూ, రబ్బరువలె సాగేలాగా ఈకలంత తేలిక, మృదువుగానూ తయారు చేయవచ్చును.

గృహోపకరణాలు, భవన నిర్మాణ సామగ్రి మొదలు, డెంపర్లు, శస్త్రచికిత్స పరికరాలు, బోట్లు, కారు విమానాలు, కృత్రిమ ఉపగ్రహాల భాగాలు ఒకటేమిటి ప్లాస్టిక్ పదార్థం ఉపమోగపడని సందర్భం లేనేలేదనే చెప్పవచ్చును.

ఇరవై అయిదు సంవత్సరాలక్రితం వరకూ ప్లాస్టిక్ పదార్థం సహజ వస్తువులకు బదులుగా చౌకపారు వస్తువులు తయారు చేయటానికి పనికి వచ్చేదిగా పరిగణింప బడేది. దీనిలో కొత్తకొత్త వస్తువులు, ఉపయోగాలు కనిపెట్టటంతో దీని ప్రాధాన్యత అద్భుతంగా పెరిగిపోయింది. మానవుని సౌఖ్యానికి రసాయన శాస్త్రం ప్రసాదించిన గొప్ప వరాలలో ఇదొకటైంది.

## ప్లాస్టిక్ పుట్టుక

ప్లాస్టిక్ పదార్థాల పుట్టుక 1846 నాటిది. స్విట్జర్లాండ్, బెసల్ విశ్వవిద్యాలయంలో జర్మన్ రసాయన శాస్త్రవేత్త క్రిస్టియన్ షోయన్‌బీన్ గంధకికామ్లము, నత్రికామ్లములలో దూదిని తడపగా గన్ కాటన్ అనే తీవ్రమైన ప్రేలుడు పదార్థం తయారైంది. ఆయన ఈ పరిశోధన ఫలితంగా శాస్త్రవేత్తలంతా సెల్యులోజ్ తో ప్రయోగాలు మొదలు పెట్టారు. అదే సంవత్సరం ఫ్రాన్సు దేశస్థుడు లూయీ మెనార్డ్ సెల్యులోజ్‌లో కొద్దిగా సీనత్రికామ్లము కలిపి కొలోడియన్ అనే ఒక జిగట పదార్థం తయారుచేశాడు. రెండేళ్ల తర్వాత ఒక అమెరికన్ విద్యార్థి జెపార్కర్ మెనార్డ్ ఈ జిగట పదార్థాన్ని చిన్న చిన్న గాయాలకు వేసినప్పుడు అది గాయంమీద సన్నని, గట్టి పొరగా ఏర్పడి, దాన్ని అంటుకోకుండా చేస్తుందని కనుగొన్నాడు. తత్ఫలితంగా ఈ కొలోడియన్ ద్రవరూపంలో "కోర్టు ప్లాస్టర్" అనే పేరుతో వాణిజ్య స్థాయిలో ఉత్పత్తిజరిగి అనుకోని విజయం సాధించింది. పదిహేను సంవత్సరాలు గడిచిన తర్వాత ఒక అమెరికన్ యువ ముద్రాపకుని షాపులో కొలోడియన్‌తో తయారైన ఒక స్ప్రిల్డ్ బాటిల్ (సన్నని రంధ్రాలు గలసీసా) వెలిసింది. నేటి ప్లాస్టిక్ యుగపు అద్భుతాలకు అదే నాంది ప్రస్తావన.

ఆ ముద్రాపకుడు జాన్ వెస్లీ హైట్, ఒక కుమ్మరి యువకుడు. అతడు స్ప్రిల్

కొలోడియన్ కనుగొన్న సమయంలోనే బిలియార్డ్ బంతులకు ఉపయోగించేదంతానికి ప్రత్యామ్నాయ పదార్థాన్ని కనుగొనే ప్రయత్నంలో ఉన్నాడు. ఈ ప్రత్యామ్నాయ పదార్థాన్ని కనిపెట్టిన వారికి ఒక న్యూయార్కు వ్యాపార సంస్థ 10,000 డాలర్లు బహుమానం ప్రకటించింది. కొలోడియన్‌ను దంతంలాగా గట్టిపరచటం జరిగింది. హైట్ ఇంటిదొడ్డి అడ్డెకు తీసుకొని అందులో కొలోడియన్‌లో ప్రయోగాలు ప్రారంభించాడు.

హైట్ గన్ కాటన్‌తో ప్రయోగాలు చేస్తున్నాడనీ, అది ప్రేలి పరిసరాలకు నష్టం కలిగించవచ్చుననీ పుకార్లు పుట్టినవి. చివరకు అతడు ఒక మారుమూల చావడికి తన సరంజామా మార్చి తలుపులు బిగించుకొని ప్రయోగాలు కొనసాగించాడు. 1863 లో ఆ చిన్న షెడ్డులో 'సెల్యులాయిడ్' పుట్టింది. ఇది తొలి కమర్షియల్ సింథటిక్ ప్లాస్టిక్.

ప్లాస్టిక్ అవతరణకు, ఫోటోగ్రాఫీ అభివృద్ధికి సన్నిహిత సంబంధమున్నది. ఈ సంబంధం చాల ఆసక్తికరంగా ఉంటుంది.

సెల్యులాయిడ్ న్యూఆర్కు (న్యూజెర్సీ) నగరంలో ఉత్పత్తి అయింది. ఆ నగరంలో హానిబాల్ గుడ్విన్ అనే ఒక మతాధిపతి వారంవారం రాత్రుల్లు జరిగే ప్రసంగాలలో స్లైడ్లను చూపించేవాడు. తనకు కావలసిన కొన్ని స్లైడ్లు ఆయనకు లభించకపోవటం వల్ల, పుస్తకాలలో, పత్రికలలోని బొమ్మలను ఫోటోలుతీసుకోటంద్వారా తనేస్వయంగా తయారు చేసుకోటం ప్రారంభించాడు. స్థానికంగా దొరికే వస్తువు సెల్యులాయిడ్. అప్పట్లో ఫోటోలు తీయటానికి ఉపయోగించే గ్లాసు ప్లేటులకు బదులు సెల్యులాయిడ్ ఉపయోగించటానికి యత్నించాడు. ఇదే రోల్ ఫిల్ము పుట్టుక ప్రారంభం. దీన్ని తయారు చేసింది జార్జ్ ఈస్ట్‌మన్. ఈయన ఒకప్పుడు బ్యాంకు గుమాస్తా. గొప్ప సాహసికుడు. ఛాయా చిత్ర ప్రియుడు. ఆ అభిరుచే ఆయన చిన్న హాండ్ కెమేరా కనిపెట్టడానికి కారణమైంది. తొలి పలచని ఫ్లెక్సిబిల్ ఫిల్ములలు 1889 లో ఈస్ట్‌మన్ తయారు చేశారు.

అదే సంవత్సరం ఒక బెల్జియన్ కెమిస్టు డాక్టర్ లియో హెచ్. బేక్‌లాండ్ అమెరికా వచ్చాడు. ఆయనకు అమెరికాలో సంచార ఆచార్యత్వం లభించింది. అమెరికా ఆయన్ను ఆకర్షించింది. అక్కడే ఉండాలని నిర్ణయించుకున్నాడు, ఒక ఫోటోగ్రాఫిక్ పేపరు కనిపెట్టాడు. ఈ పేపరులో ఎకాయెకిన ఫోటోగ్రాఫులను ప్రింటు చేయవీలవుతుంది. ఈయన ఈ పేటెంటును కొన్ని లక్షల డాలర్లకు ఈస్ట్‌మన్‌కు అమ్మాడు.

దానితో బేక్‌లాండ్ ఆర్థిక స్తోమత ఏర్పడింది. ఇక తన తొలి అభిమాన పాత్రమైన రసాయన పరిశోధనకుపక్రమించాడు. ఒక వర్కుషాపు వెనక భాగంలోనూ, తన ఇంటి అడుగు భాగంలోనూ, ప్రయోగాలు సాగించాడు. బాగా పనికివచ్చే కొత్త లక్షణాలు గల మేలు రకపు రెజిన్ యాంబర్ (సర్జరసపు కర్పూర పూస) తయారుచేయాలని అతడిఆశయం. 'బేక్‌లైట్'ను సృష్టించాడు. అమెరికన్

ఆర్థిక వ్యవస్థలో అత్యద్భుత ప్రభావంగల గట్టి, విరగని ప్లాస్టిక్ పదార్థమిది. రేడియో టెలిఫోన్, మోటారుకారు, వగైరా వస్తువుల అవతరణలో ఈ కొత్తవస్తువుకు గిరాకీ హెచ్చింది.

అపారంగా లభించే మామూలు ముడి పదార్థాల మౌలిక భాగాలను ఉపయోగించుకొని మానవుని అవసరాలు తీర్చగల కొత్తకొత్త వస్తువుల తయారీలో తొలి సోపానాలే సెల్యులాయిడ్, బేక్‌లైట్.

ప్లాస్టిక్‌ల పుట్టుక నాటినుండి నేటికి ఎన్నో పరిణామాలు సంభవించినవి. పోలిమెరైజేషన్ పద్ధతి ద్వారా ఈ పరిణామం జరిగింది. అంటే అనేక చిన్న చిన్న మోలిక్యూల్స్ (అత్యంతల్ప పరమాణు సమూదాయం) సంయోగం ద్వారా ఒక పెద్ద మోలిక్యూల్ తయారు కావటం.

ఉదాహరణకు, ఈ నాటి ఒక ముఖ్యమైన ప్లాస్టిక్ పదార్థం పోలిస్టిరీన్, బొగ్గు పెట్రోలియం ద్వారా తయారు చేస్తున్నారు. మోలిక్యూల్ స్వరూపం మారకుండా ప్రక్రియను శీఘ్రతరం చేయగల రసాయన పదార్థాలు, వేడి పీడనం ద్వారా మోలిక్యూల్స్ సూక్ష్మకణాలుగాగుట్టలు గుట్టలుగా పొడవు పాటి గొలుసు కట్లుగా ఏర్పడుతవి. వీటిని వేడిలో ప్రాసెస్ చేయగా అవి చిన్న పెళ్లలుగా తయారయేవి. వాటినే మోల్డింగ్ పొడఉ అంటారు. ప్లాస్టిక్ వస్తువులు ఉత్పత్తి చేసే సాధారణ పదార్థాలలో ఇదొకటి. బొగ్గు, పెట్రోలియం నుండి పుట్టిన ఈ ముడి పెళ్లలనుంచే గృహోపకరణాలు, ఆట వస్తువులు, ఫోనోగ్రాఫ్ రికార్డులు, యంత్ర విభాగాలు, ఇంకా అనేక రకాల వస్తువులు తయారౌతున్నవి.

మంచి సొగసైన, ఉపయోగకరమైన ప్లాస్టిక్‌లలో ఒకటి యాక్రిలిక్ రెసిన్. ఇది పరిశుద్ధంగా గ్లాసువలె ఉంటుంది. కళ్లద్దాలకు ప్లాస్టిక్కుల ఉపయోగం పెరిగిపోయింది. ముఖ్యంగా పిల్లలకు ఇవి ఎక్కువగా ఉపయోగపడుతున్నవి. గనులలో పని చేసేవారికి గ్లాసులు, నేత్ర కవచాలు, రెండూ అవసరం.

సెల్యులోజ్ ప్లాస్టిక్‌లలో ప్రశస్తమైనది. సెలోఫేన్ అనే పల్చని ఫిలిమ్. 1924 లో జాక్వెస్ ఎడ్. బ్రాండెన్ బెర్గర్ అనే ఒక స్విట్జర్‌లాండ్ వాసి దగ్గర దీని పేటెంటును కొని అమెరికాలో తొలిసారిగా దీన్ని తయారుచేయుటం జరిగింది.

అమెరికా పాకేజింగ్, క్రయ పద్ధతుల మీద ప్లాస్టిక్ ఫిలిముల ప్రభావంఅపారంగా ఉన్నది. ఆహార పదార్థాలు చెడిపోకుండా పాకేజి చేయటానికి ఇవి వీలు కల్పించింది.

నైలాన్, రేయన్ వంటి సింథటిక్ రబ్బరు నూలు, వస్త్రాలు ఉత్పత్తిచేయుటం ద్వారా సాంప్రదాయిక పదార్థాలను ఉపయోగించటంలో ప్లాస్టిక్ పరిశ్రమ గొప్ప విప్లవం తీసుకొచ్చింది. భవిష్యత్తుకు అపార అవకాశాలను కల్పిస్తున్నది. అందుకే ఇది ప్లాస్టిక్ యుగం అనవచ్చును.

—(౦)—

# జ్యోతిష్మతి

మూలం :

శ్రీ జయశంకర ప్రసాద్.

అనుసరణ :

శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ.

గాఢతమః పరివృతమైన నిశాదేవి హృదయ పథాన నక్షత్రగణాలు మిలమిల మెరుస్తున్నాయి. కాంతిమండలాన్ని కప్పజూచే చీకటి తెరలను నక్షత్రకాంతులు భేదించుకొని వస్తున్నాయి. అందువల్లనే కాబోలు - ఆకాశంక్రింద ఆవరణఅంతా చిద్రమైంది.

హిమవత్పర్వత శ్రేణులమధ్య నొక చిన్నలోయ శైలసంకులమైన ఆవన్య ప్రదేశంలో వనస్పతులూ గడ్డిమొక్కలూ గుబురుగా పెరిగిఉన్నాయి. వసంత వన్యలతలు నలువైపులా ఆవరించినాయి. అత్యున్నత ప్రదేశంలో ఆలోయ ప్రకృతి పటానికొక సజీవ చిత్రమై భాసించింది.

ఆ పర్వతమార్గాలలో పలుచని కంబళమును కప్పుకొని పయనించుచున్న దొక బాలిక. విరాట్ హిమగిరిమెడలోని ముగ్ధశిశువు క్రీడలను విడంబిస్తున్నాయామె నడకలు. నడకలో నామె ముంగురులు చెల్లాచెదరౌతున్నాయి. తన ముద్దుబిడ్డ క్రీడి చూస్తూంటే _ గాఢసుషుప్తిలోనున్న హిమవత్పర్వత మామెను ముద్దుపెట్టుకొనలేకపోయింది. స్తబ్ధమైన ఆ ప్రదేశమామె గమన సౌందర్యంతో ప్రకాశమయమైంది. ఆమెమనస్సులో స్వచ్ఛశీతల స్రోతమేదో ఏకాగ్రంగా ప్రవహిస్తోంది. ఆమెకూడా ఏకాగ్రతతో దేనికోసమో వెదకుతోంది.

వెదకి వెదకి ఆమె అలసింది. అన్వేషించిన వస్తువు కన్పించలేదు. కోలుపోయిన వస్తువును దేనినో వెదకుకొంటున్నట్లామె తీవ్రంగా అన్వేషిస్తూ ఆమె తనను తానే కోల్పోయింది కాబోలు - దారితప్పి ఎక్కడికో అజ్ఞాత ప్రదేశానికి వెళ్ళిపోతోంది.

ఎదుట నిశాదేవి నిశ్శబ్దతను భంగపరుస్తూ సెలయేరు కలవరంచేస్తోంది. అజ్ఞాత ప్రదేశంలో భయభీతయై - స్తబ్ధురాలై నిలచినదామె. నిశాదేవి గంభీర స్వరూపంతో ఆమెను భయవిహ్వలతకులోను చేస్తోంది. మూర్ఛతో ఆమె ఒకరాతిబండపైన కూలబడింది.

కొన్ని క్షణాల్లో నామెగుండె దిటవు తెచ్చుకొని అంధకార సముద్రంలో సంగమిస్తున్న సెలయేటివైపు చూస్తూ విశ్రమించింది. పైనున్న తారాగణాల ప్రకాశమూ - క్రిందప్రవహించే సెలయేటి ముర్మర ధ్వనులూ ఆమెకేదో అన్వేషణలో సాయపడి సూచన లీయజాలకపోయినాయి. ప్రకృతి మౌనంవహించినందున ఆమె తనకోరిక యేదో ప్రకృతికి తెలుపజాలకపోయింది. ప్రకృతియొక్క మూ సంకేతాలనూ అర్థం చేసికొనలేకపోయింది.

అకస్మాత్తుగ ఎవ్వరో ఆమెను వెన్నుచరచేరు. వెనువెంటనే కంపిత స్వరంతో ప్రశ్నించిన దామె.

"ఎ...వ...రు?"

"అది నేను వేయవలసినప్రశ్న - ఈనిర్జన నిశీధంలో - క్రూరజంతువులు విచ్చలవిడిగా తిరుగాడే సమయాన దుర్మార్గులూ - సంఘద్రోహులూ దొంగలూ స్వేచ్ఛగ సంచరించేవేళల్లో - నీవు...ఇక్కడి కెందుకొచ్చేవు?" అని ప్రశ్నించే డామెనొక యువకుడు.

ఆ సుకుమారికి క్రూర మృగాలూ, సంఘద్రోహులూ, చోరులూ తలపునకురాగానే హృదయం కపించింది. గుండె దిటబట్టుకొని అమె ప్రత్యుత్తరం మొసగింది.

"అత్యంతావశ్యకమైన వస్తువు నొక దాన్ని సాధించడానికి ఒంటరిగా బయలుదేరేను - నాయీ ప్రయత్నంలో ఎన్నిప్రమాదాలు వచ్చినాసరే జంకను. కాని...నీవెవ్వరవు?"

"నేనా? ఒక సాహసికుడను..."

"సాహసికులూ, సంఘద్రోహులూ దస్యులూ కడకిక్కడున్న వన్యమృగాలూకూడా కలుపుకొని ఎవ్వరున్నాసరే - ఈక్షణంలో నేనుచెప్పినట్లు చేసి తీరాలి..."

"ఆ! అల్లాగా? నిజమైన సాహసికవు ఏవే సుందరీ! ఇంతకూ నీకేంకావాలి? తర్వాత - నీపేరేమిటి? చెప్పు?

"నాపేరా? వనలత, కావాల్సింది వనలత?"

"ఓహో వనరాజు కూతురువా నీవు? ఆ ముసలి గ్రుడ్డి, వనరాజుపుత్రికవా నీవు?"

"అవును"

"సదా_నాకు హానితలపోయడమే ధ్యానంగా పెట్టుకొనే వనరాజుకూతురవేనా నీవు ?"

"ఆయన నీకుచేసినహాని ఏదో నాకేం తెలీదు. ఇంతకూ నీవిప్పుడు నామాట మన్నిస్తావా లేదా ?"

"ఈ క్షణంనుండి నేను నీకత్యంత విశ్వసనీయుడనైన అనుచరుడను. ఏం కావాలో చెప్పు—"

"'జ్యోతిష్మతి' కావాలి. ఆ వనమూలికతోనే నాన్నగారి అంధత్వం అంతమొందుతుంది."

"సరే వెదకుదాంపద." అంటూ సాహసికుడామెచెయ్యి పట్టుకున్నాడు.

ఇరువురూ శైలవనంలోనికి చరచరా చొచ్చుకుపోయేరు. పాషాణఘాతాలతో వారి పాదాలనుండి రక్తం స్రవించింది.

ఇద్దరూ వడివడిగా నడుస్తున్నారు.

"ఆగు. చూడు _ ఆ కన్పించేదేమిటో చూడు" అన్నాడు సాహసికుడు.

శ్యామల మేఘాచ్ఛన్నమై - తృణసంకులమైన శైలమంటపం మధ్యన 'హిరణ్యలత' నక్షత్రకాంతులతో ప్రకాశిస్తున్న పుష్పాలతో విరాజిల్లుతోంది. మందమారుతలతో హిరణ్యలతాంతసౌరభం వికంపిస్తున్నాయి. రాత్రి నాల్గవయామం. చతుర్దశి చంద్రుడు క్షీణకాంతులతో మందహాసం చేస్తున్నాడు. ప్రాగ్దిశలో ప్రకృతి స్వప్న ముకుళిత నేత్రాలను బద్ధకంగా తెరచి _ చూడడానికి యత్నిస్తోంది.

'వనలత' ముఖం వికసించింది. బంగారు పూవుల తీవను చూడగనే ఆమె హృదయం ఆనందంలో తన్మయతనొంది నర్తనంచేసింది.

"ఓ_సాహసిక శిరోమణీ ! ఇదే నాకు కావాల్సిన - నేను కోరినట్టి 'జ్యోతిష్మతి' - ధన్యురాలను"

విజయోత్సాహంతో - తానిచ్చినమాట సఫలమైనందుకు సంతసించేడు సాహసికుడు. ఇక జ్యోతిష్మతిని ఊడబెరకడం మాత్రమే మిగిలింది. సాహసికుని కదెంతపాటి పని? తక్షణం జ్యోతిష్మతిని పెరకి తీసుకురావడానికి బయల్దేరేడతడు.

"ఆగు - ఒక్క సంగతి నీకు వివరించాలి" అన్నది వనలత

"ఏమిటది ?"

"నీవెప్పుడైనా ఎవరినైనా, ప్రేమించి ఉన్నావా ?"

"అయితే__?"

"ప్రేమించిన వ్యక్తినుండి ప్రతిఫలంకోరని నిష్కామ ప్రేమయేనా నీది ?"

"పుణ్యఫలితం లభించినప్పుడు అనుభవించకుండా నిరాకరించడం పాపమే ఔతుందేకాదా సుందరీ?"

"అసలు నీవెవర్నైనా ప్రేమించేవా ? సూటిగా చెప్పు."

"ఏం ? అయితే ని... న్నే... ప్రేమించేను." అంటూ యువకుడు ముందున కడుగువేసి ఆమెను సమీపించేడు.

"ఐతేవిను. ఎవరైతే రాత్రి నాల్గుజాములూ నిశ్చల మనస్సుతో ప్రియులను ధ్యానిస్తారో వారే జ్యోతిష్మతిని స్పృశించాలి. అన్యులు స్పృశించరాదు. ఈ వన్యప్రాంతాలలోని పవిత్రప్రేమికులు మాత్రమే 'జ్యోతిష్మతి'ని స్పృశిస్తారు. అట్టి ప్రణయ సమాధివారికి చిరాభ్యస్తం గనుక వారే జ్యోతిష్మతిని తెస్తారు. అల్లా తెస్తేనే దానిగుణం నిండు వెన్నెల రాత్రులలో ప్రియులకై వేదననుభవించని వారా మూలికను ముట్టుకోరాదు."

వనలతచెప్పిన ఈ మాటలను వినకుండానే కత్తి పిడిని గట్టిగాపట్టుకొని వనస్పతివైపునకు పురోగమించేడు సాహసిక యువకుడు.

ఆమె గొంతు చించుకొని అరచింది.

"ఆగు...కష్టపడి కనుక్కొన్నాం. దానిని మాత్రం ముట్టుకోకు వద్దు,.. ఆహ్... నాన్నగారి కండ్లు."

సాహసికుడు జ్యోతిష్మతిని స్పృశించలేదు. కాని పొడుగాటి అతనినీడలు జ్యోతిష్మతిపైబడి ఆమూలికపైన ప్రసరిస్తున్న చంద్రకాంతులను నిరోధించేయి.

వనస్పతి ఒక్క దీర్ఘ నిశ్వాసంతో చైతన్యాన్ని కోల్పోయింది. ఆ వనస్పతి లతలనానుకొని విద్యుత్కాంతులను విరజిమ్ముతున్న మెరపుపుష్పాలు మేఘాలల్లో లీనమైపోయేయి. చంద్రభగవానుడు మెల్లగా పశ్చిమ శైలమాలల్లోకి దిగజారి క్రుంగిపోయేడు.

ఝుం ఝూమారుతా ఘాతాలవల్ల కొట్టుకుపోయిన వన్యలతవలె 'వనంత' నేల నాలింగన మొనర్చుకొంది.

సాహసిక యువకుని ముఖమండలాన్ని అంధకార తరంగాలు చుట్టుముట్టేయి.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

సీ॥

హరి హయ స్వాంత మందా విర్భవంబాయె
ఘోరభయంబొందు, తోరముగను
సప్తలోకములందు శబ్దంబు వ్యాపించి
వణకుఁబుట్టించె నవ్యాజముగను
సప్తసముద్రముల్ - స్తంభించె; పాతాళ
లోక నివాసులు - వ్యాకులమునఁ
గలఁగఁ జొచ్చిరి; సప్తకుల పర్వతంబులు
కదలి యల్లాడె, నక్కజముగాఁగ

రామ! నీ బాహుబలమున బ్రద్దలైన
హరుని కోదండమునఁ బుట్టినట్టి తీక్ష్ణ
మైన శబ్దంబుచే, నింతలైన వింత
లుదయమయ్యెను; శ్రీరామ? సదయఁ
గనుము!

సీ॥

బ్రహ్మాండ భాండంబు - బ్రద్దలైపోయెను
ఖండంబులై పోయె గగన వీథి
ఆది శేషుఁడు, భయమంది వడఁకెను
అల్లకల్లోలమై, యాదెవనధి
దిక్పతుల్ క్షోభించి, దిశలను వీడిరి
కులపర్వతంబులు గ్రుంగెభువిని
చుక్కలన్నియు రాలెఁ జూర్ణ చూర్ణంబులై
గ్రహము లన్నియుఁదమ గతులఁదప్పె

శ్రీ రమేశ! నీకోదండ నారి యొక్క
ధ్వని, దశాశలన్ నిండి, విధ్వంసకాండ
జరిపె నీరీతి, శ్రీరామచంద్ర! శాంత
మూర్తిని ధరించి, కావుమా భువనములను

౬౦

సత్య మూర్తివి! చండ ప్రచండమైన
నిండు కోదండమును దాల్చి, నిత్యజయము
గొన్నవాఁడవు; భూమాత పున్నెమెంతో!
పుణ్య రామావతారంబు బొందినావు!
ఇంద్రుఁడాది, దేవతలతో నెపుడు సేవఁ
గొనుచు నున్నావు; రామ! మా కొలము దైవ
తమవు నీవ! నీధ్యానంబె, తపసు మాకు;
దండములఁగొను మయ్య! కోదండపాణి!

౬౧

మందారముల తోటయందుండు, చంద్రకాం
త గృహంబు, దానియంతరము నందు
బంగారు పీఠంబు రంగారు; దానిపై
సీతాసమేతుఁడై - శ్రీ శుభాంగ!
కూర్చున్నవాఁడవు; కొలువగా భరత ల
క్ష్మణులు మారుతియును-మమతతోడ
ఇందీ వరశ్యామ! ఇనకుల భూషణా!
శ్రీరామ చంద్రమా! శేషశాయి!

నీలమేఘశ్యామ! వరద! నిత్యమంద
హాస భూషితవదన! జోహారునీకు!
నాదు తాపత్రయంబుఁ బోనాడఁజేసి
చిత్తశాంతిఁ జేకూర్చుమా! శ్రీరమేశ!

౬౨

రత్నకంకణహస్త! రామచంద్రప్రభూ!
మందారవనములో, సుందరాంగి
భూజాతయొడలిపై - పులకాంకురములంకు
రింప, నామెను కౌగిలించినావు
మణిపాదుకాద్యుతి మహిమతో నీ పాద
నఖములు గాంతితో నాట్యమాడె;
నట్టి పాదములతో - యానంద రూపుడై
సంచారమును సల్పు సార్వభౌమ!

రామచంద్ర! దయాసాంద్ర! భక్తి తోడ
దర్శనంబిమ్ము; శ్రీవాక్సుధారసమ్ము
కొంత నాపైనఁజిల్కుము; శాంతమిమ్ము!
అచ్యుతానంద! శ్రీరామ! హరి! ముకుంద!

౬౩

సీతాకుచద్వంద్వ సీమలో శ్రీరామ!
సతము, నీహస్తముల్ - సంచరించు,
భూజాత ముఖపద్మమును, నీదు కెమ్మోవి
భృంగంబు తమిని - చుంబించుచుండు
కంకణ ధ్వనులతో - 'నోంకార' శబ్దంబు
హెచ్చుప్రతిధ్వని నిచ్చుచుండు,
రామచంద్రుండ! శరత్కాల చంద్రికఁ
బురుడించు నీనవ్వు పుణ్యపురుష!

రామ! తారక మంత్రమై - భక్తితోడఁ
జెలఁగె నీ ముద్దు నామంబు; చిత్త శుద్ధి
నిన్ను సేవించు భక్తుల కెన్నడేని
భయము గల్గునే శ్రీరామ! భద్రమూర్తి

౬౪

భరతశత్రుఘ్నులు - భక్తితో సేవింప
లక్ష్మణుండు, గరంబుర క్తిఁగొలువ
నీల, నలాంగదుల్ - నిష్ఠ మ్రొక్కుచు
నుండ
రావణానుజుఁడు, గరములు మోడ్చ,
సుగ్రీవుఁడనయంబు - జోహారులర్పింప
శ్రీ భరద్వాజు లాశీర్వదింప
గాధేయుఁడు, వశిష్ఠగౌతమ మునివరుల్
నిను సదాప్రార్థింప - నెమ్మితోడ
రామ! సీతాసమేతుఁడై - రక్తి చెలఁగ
అమర సామ్రాజ్య పీఠస్థుఁడైన తరుణ
మందు, నన్నొకింతగఁ జిత్తమందుఁదలఁచి
ననుఁ గృతార్థుని సల్పుమా-నాగశయన!

౬౫

ఛత్రచామరములు - సౌమిత్రి సోదరుల్
బట్టి, శుశ్రూషలు - భక్తిసలుప
సామీరియును, విభీషణుఁడు, సుగ్రీవ న
లాంగదాదులు, సేవలందజేయ
దా తొడపైనున్న - సీతామహాదేవి
గౌరవించుచు, సహాకార మొసఁగి
జ్ఞానముద్రికను, హస్తంబునఁ ధరియించి
పరతత్త్వ బోధల బరగఁదెల్పి
నవ్య సామ్రాజ్యసింహాసనమున, ముదముఁ
జెలఁగ వసియించియున్నావు; శ్రీ సమేత!
వరద! శ్రీరామచంద్ర! నా పైనొకింత
కరుణఁగల్గి రక్షింపుము; శరణు! శరణు!

(సశేషము)

# బొమ్మ - బొరుసు

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి

—(౦)—

నిర్మల నవ్వింది.
ఆ నవ్వులో ఎంతో ఆకర్షణ ఉంది.
ఆ నవ్వులో ఏదో అంతరార్థం ఉంది.
"ఎందుకు నవ్వుతున్నావ్ ?"
ప్రకాశరావు ప్రశ్నించేడు.
నిర్మల సమాధానం యివ్వలేదు
మళ్ళీ నవ్వింది.
విరగబడి నవ్వింది.
"మతిగాని పోయిందా ?"
"అది కాదండీ ?"
"ఏది కాదు ?"
"నేను చెప్పను"
"పోనీ మానెయ్యి"
నిర్మలముఖం చిన్నబోయింది.
ఉత్సాహం దిగజారిపోయింది.
"చిక్కుముఖం వేశావేం ?"
ఓదార్చబోతున్నాడు ప్రకాశరావు
"చెప్పొద్దన్నారుగా"
"పోనీ చెప్పదూద్దాం"
చెవిలో ఏదో చెప్పింది నిర్మల
ఆయనకూ నవ్వాగలేదు
నిర్మలకూడా నవ్వింది.
"అదా సంగతి ?"
"మరేమిటనుకున్నారు ?"
"అబ్బాయా ? అమ్మాయా ?"
"ఏమో ! నాకేం తెలుసు !"
"పోనీ నీకెవరు కావాలో చెప్పు"
"అమ్మాయి కావాలి.
మరి మీకో ?"
"నాకు అబ్బాయి కావాలి"
"ఊహూ ! అమ్మాయి"
"ఊహూ ! అబ్బాయి"
"నాకు అమ్మాయే కావాలి"
"అమ్మాయిఅయితే కట్నాలిచ్చుకోవాలి"
"వరకట్ననిషేధం వచ్చిందిగా"
"నాకు అబ్బాయే కావాలి"
"అబ్బాయిఅయితే చదివించుకోవద్దూ !"
"అయినా పర్వాలేదు"
"నాకువద్దు"
:"పోనీ లాటరీ వేద్దాం"
"సరే"
"బొమ్మ అబ్బాయి
బొరుసు అమ్మాయి
నీకేం కావాలి ?"
"బొరుసు"
"కాదు. బొమ్మే పడింది"
"అమ్మో ! మోసంచేశారు"
"నేనా ?"
"అవును. మీరే !"
"పోనీ మళ్ళీ వేద్దాం"
"సరే. ఈసారి జాగ్రత్తగా చూడాలి"
"బొమ్మా ! బొరుసా !"
"బొరుసు"
"అబ్బో ! బొరుసే పడింది"
"నేనే నెగ్గేను"
"మొదట నేనూ నెగ్గేను"
"అది లెఖ్ఖ కాదు"
"యిదీ లెఖ్ఖ కాదు."
"నే నొప్పుకోను"
"మరోసారి వేద్దాం"
"ఊహూ"
"మొత్తం మూడుసార్లు"
"సరే. మీయిష్టం"
నిర్మలకు నీరసం వచ్చింది
యిహ మాట్లాడలేకపోయింది.

II

"భోజనం తయారయిందా ?"
ప్రకాశరావు అడిగేడు.
"లేదండీ ?"
"మరి ఆఫీసుకు వేళవుతోంది"
"చాలా నీరసంగా ఉందండీ ?"
"పనిమనిషి ఏమైంది ?"

"ఈరోజు రాలేదు"
"వంటపనులు చెయ్యొద్దని చెప్పలేదూ!"
"మరి ఎట్లాగ"
"పోనీ నువ్వేపనిచెయ్యి"
"ఏమిటది?"
"పుట్టింటికివెళ్లు"
"మరి మీరో?"
"నన్నుకూడా నీతో రమ్మన్నావా?"
"అదికాదండీ? మీకు
భోజన సదుపాయం ఉండదేమోనని"
"హోటల్లో తింటాను"
"ఆరోగ్యం పాడవుతుంది"
"పర్వాలేదు"
"సరేకానీ"
"మరేమిటి?"
'రాత్రిళ్లు యిల్లు కదల్లేకదా!"
"మంచి అనుమానమే"
నిర్మల పుట్టింటికి వెళ్ళింది.
ప్రకాశరావుకి ఒంటరి జీవితం
హోటలులో భోజనం
గడవని రోజులు
గడ్డురోజులు
కాలచక్రం గిర్రున తిరిగింది.
నవమాసాలూ నిండేయి
నిర్మలకు కవల పిల్లలు.
ఒక అబ్బాయి - ఒక అమ్మాయి
యిద్దర్నీ ఎత్తుకుంది.
యింటికి చక్కావచ్చింది.
ప్రకాశరావు నవ్వేడు
నిర్మలా నవ్వింది
ఆయన అబ్బాయిని ఎత్తుకున్నాడు
ఆవిడ అమ్మాయిని ఎత్తుకుంది.
"యింతకూ ఎవరిపంతం నెగ్గినట్టు!"
"నాపంతం నెగ్గింది"
ధైర్యంగాఅంది నిర్మల
"నాపంతమూ నెగ్గింది
నీకు ఆడపిల్ల కావాలిగా
నువ్వేపెంచి పెళ్లి చేసుకో.
నాకు అబ్బాయి కావాలి
నేనే కష్టపడి చదివించుకుంటాను"
"అయితే మీకూ మాకూ మాటల్లేవు"
"ఏం!"
"యికమీదట మీరూ, అబ్బాయీ వేరు
నేనూ అమ్మాయీ వేరు"
ప్రకాశరావు నోట్లో
పచ్చివెలక్కాయ పడ్డినట్టయింది
నిర్మల నవ్వింది
ఆయనా నవ్వేడు.

# స్త్రీలు — పొదుపు ఉద్యమాలు

శ్రీమతి చిల్లా కమలాదేవి

నేను చెప్పే విషయం హాబీ అనండి, వృత్తివిద్య అనండి, కుటీరపరిశ్రమ అనండి, ఏమైనా అనండి, నేటికాలంలో పరిశ్రమలను వృద్ధి చేయటం ఎంతో అవసరం. కాలం క్షణక్షణానికి నవ్యపథం త్రొక్కుతూండటం మనమంతా చూస్తూనే యున్నాము. అందులో ఈరోజున్న ఫాషన్ రేపటికి ఎట్లామారుతుందో ఎవరికి తెలియదు. దీనికంతా కారణం మనపురోభివృద్ధే! ఆ పురోభివృద్ధితో పాటు మన ఆదాయం పెరిగితే పేచీలేదు. కనుక స్త్రీ అయిన ప్రతివారికి మధ్యాహ్నము పూట షుమారు మూడుగంటలు విశ్రాంతి దొరుకుతుంది. ఒక గంట విశ్రాంతికి పోయినా తక్కిన రెండుగంటలు తోచటంలేదని వృథాగా గడుపుతాము. ఆ రెండు గంటల్లో ఏదైనా కుటుంబ ఆదాయం పెంచుకోటానికి హాయిగా కృషిచేసుకోవచ్చు. ఆ కృషి ఏదైనా కానీయండి-ఎవరి యిష్టమొచ్చినట్లు వాళ్ళు చేసుకుంటానికి దేశంలో ఎన్నోఉన్నవి. ఎటువంటి కష్టమైనదైనా యిష్టపూర్తిగా చేసే పని కష్టమనిపించదు. కనుక మనం మనకు ఉత్సాహమైనదేదో ముందుగా నిర్ణయించుకోవాలి. అది మనకాలానికి వీలుగా ఉండేదిగా చూచుకొని పూనుకోవాలి.

ఈ ఆచారం యిప్పుడిప్పుడు అనుకుంటె వెలిసేదిగాదు. ఇది అనాదికాలంనుంచి మనతో పాటు వస్తూనేయున్నది. అప్పటివారు యింట్లోపనులు ముగించుకోగానే నూలువడకటమో, నారపేనటమో, పిడకలు చేయటమో, ఏదో కృషిచేస్తుంటారు. యిప్పుడు చూడండి. నూలువడికి సాలెవానిచేత నేయించుకుంటె, మనకు సంవత్సరమునకు సరిపోయే బట్ట సగం ధరకేగిడుతుంది. నారపేని మనమంచాలకు అల్లుతారు. తరువాత మనంహీనంగా చూచేపిడకలు వంటచెఱకుగా ఎంతగానో ఉపయోగపడుతుంది. యిలా చేయటంవల్ల ఎంతఆదాయమో! చూడండి. కాని కాలం మారింది. యిటువంటి పనులుగాక పోతే మనకు తృప్తిగా చేసుకునే పనులు ఎన్నిలేవు!

యింతకృషి చేసినా మనం ఖర్చుచేసేది పరిమితంగా చేసుకోటం ఎంతో అవసరం. బాగా ఆలోచించండి. కుటుంబంయొక్క పురోభివృద్ధి ఎవరిమీద ఆధారపడుతుంది. గృహలక్ష్మిమీదే! మగవారు సంపాదించుకొనివస్తారు. కొందరు సంపాదనకొద్ది అయినా అందులోనే కుటుంబంజరుపుకొని యింకామిగులుజూపుతారు. అటువంటి సంసారాలు ఎంతో ఆడంబరముగా యుంటవి. ఈ విధంగా కుటుంబాన్ని చేసుకొనేదాన్నే పొదుపు అంటారు. ఈ పొదుపు

వల్లభావిజీవితం ఎంతోహాయిగా ఉంటుంది. మానవుడు ఎప్పుడూ ఒకే విధంగా నుండ లేడు. వార్ధక్యమురాగానే సంపాదన తగ్గుతుంది. ఆ సమయమునకు యిది మనకు ఎంతగానో ఉపయోగపడుతుంది. మన గవర్నమెంటువారు పొదుపు ఉద్యమాలు స్థాపించి సంఘానికి ఎంతో కృషిచేయుచున్నారు.

కొందరు ప్రశ్నవేయవచ్చు. చేసేపని ఆసక్తిగానే ఉంది. చేసేపని గౌరవహీనంగా ఉంటె ఎట్లా చేస్తామని? మానవులకు ఆత్మాభిమానాన్ని కాపాడుకోటం కన్న వేరే ముఖ్యమైనది లేదు. గౌరవానికి భంగం వాటిల్లకుండా చేసుకునే పనులు లోకంలో ఎన్ని లేవు? అందరికి అందుబాటులో ఉండేట్టుగా ప్రతిచోట గవర్నమెంటు వారు ఖాదీ పరిశ్రమలు నిర్మించారు. అందులో పని చేసేవారికి నూలు వడకటానికి రాట్నాలు, చిలుపలు, మొదలగు పరికరములువారే యిస్తారు. మనం యింట్లోంచి కదలకుండానే ఏకులు యిచ్చి మన వడకిననూలు తీసుకొని పోతారు. యిందులో కష్టమేముంది చెప్పండి!

మన రెండో పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమాభివృద్ధికి ముఖ్యస్థానమిచ్చారు. కనుక మనం చేసే కృషికి గవర్నమెంటు సహాయం పొందటానికికూడా ఎంతో వీలుగా ఉంది. ఈ విధంగా కృషిచేయటం మనదేశంలోనేగాదు. ఉదాహరణకు జర్మని తీసుకుందాం! ప్రతియింట్లో ఎలెక్ట్రిక్ కర్మాగారం యుంటుంది. ఒక్కసైకిలు ఆకారాన్ని చేయాలంటె, ఒక్కొక్క యింటిలో ఒక్కొక్క భాగం తయారు చేస్తారు. వీటినన్నిటిని గవర్నమెంటు వారే లారీలమీద తీసుకొని పోతారు. కనుక మనదేశంలోనే గాకుండా విదేశాలలో కూడా ఈ విధంగానే స్త్రీ పురుషులు అనే భేదంలేకుండా కుటుంబాలను జరుపుకుంటారు.

నేటి కాలంలో మగవారు సంపాదించేది సంసారాలకు చాలటం దుర్లభం. మనం అందుబాటులోయున్న కాలాన్ని సద్వినియోగం చేసి కుటుంబ సహాయానికి చేయూతనివ్వటం ఎంతో అవసరం. భారత దేశం చేతి పనులుకు పుట్టినిల్లు. కనుక కుటుంబపురోభివృద్దే దేశపురోభివృద్దని అందరు కృషిచేయాలి!

# ఓ శారదా!

శ్రీ చెర్వు ఆంజనేయశాస్త్రి

—(o)—

ఓహో శారదా!
ఓ మాతా శారదా!
ఓంకారంలో జన్మించిన – మా
తల్లీ శారదా!
కల్పవల్లీ శారదా!

నిన్నే నమ్మితిమే
నీ నీడను చేరితిమే
సకల శాస్త్రములు
సర్వ కళలతో
సరగున బ్రోవగదె ... ఓహో

వేదము పాడితివే
నాదము నీరూపే
వాణీ! వందనమే
శార్వాణీ దీవించవె ... ఓహో

విరిసే జాజులమే
ఆశాజ్యోతులమే
ఉన్నత కేసరి నిలయంలో
ఉదయంచే తొలికాంతులమే...ఓహో




# న్యాయమూర్తి

"ఇందు"

అది మొగల్ చక్రవర్తి జహాంగీర్ పరిపాలనా కాలం. చక్రవర్తి భోగలాలసుడై, రాజ్య నిర్వహణ భారాన్ని పట్టపురాణి నూర్జహాన్ భుజస్కంధాలనుంచేడు ... కాని చక్రవర్తియెంత భోగలాలసుడైనా, న్యాయ నిర్ణయాలు చెయ్యవలసినప్పుడు స్వయంగా పరిశీలించి నిర్ణయంచేసేవాడు. సర్వకాల సర్వావస్థలలోనూ ప్రజలకు న్యాయం కల్పించడానికి అనువుగా తన 'హజారము' వాకిట ఒకపెద్ద గంటను వ్రేలాడదీసేడు. దానిపేరు న్యాయ ఘంట. న్యాయాన్ని కాంక్షించేవారు దాన్ని మ్రోగించిన తక్షణం చక్రవర్తి వచ్చి వారికి తగిన న్యాయాన్ని నిర్ణయం చేసేవాడు.

అప్పుడే సూర్యుడుదయించాడు. బాల సూర్యుని అరుణకిరణాలు ప్రపంచాన్ని ప్రదీప్తం చేస్తున్నాయి. ప్రజలంతా తమ తమకార్యాచరణలకు పోతున్నారు. అది మొగల్ చక్రవర్తిభవనప్రాంగణం. ముందు కనుల పండువైన మనోహర ఉద్యానవనం ఉంది. కొంచెం ప్రక్కగా ఒక గున్న మామిడితోపు, దానికి మరికాస్త దూరంలో ఒక చెఱువు ఉన్నాయి. ఆ చెరువులో చాకళ్లు తమతమ బట్టలను ఉతుకుతున్నారు. పక్షుల కలకలరావాల్తోపాటు చాకళ్లు ఉతుకుతున్న బట్టల కలకల చప్పుడుకలిసి వాటి పాటకు లయలా వినిపిస్తోంది. మహారాణి నూర్జహాన్ అంతఃపుర మందిరంముందు నున్న వసారాలో నుండి ధనుర్విద్యనభ్యసిస్తోంది.

ఇంతలో మామిడితోపులోని పక్షుల కలకలారావం హెచ్చుకేగింది. ధనుర్ధారియైన నూర్జహాన్ ఆ వంక చూచింది. ఒకడేగ రివ్వునవచ్చి మామిడి గున్నపై వాలింది. చిన్న పక్షులన్నీ భయంతో కలవరించాయి. అది చూచిన నూర్జహాన్ గురిచూచి డేగపై బాణంవదలింది: కాని డేగ తప్పించుకుని ఎగిరి పోయింది. ఇంతలో దూరాన ఒక మనిషి ఆర్తనాదం వినిపించింది. చాకి రేవులోని బట్టలుతుకుతున్న శబ్దం ఒక్కసారి ఆగి పోయింది. నూర్జహాన్ పరిచారకుణ్ణి పిల్చి ఆ ఆర్తనాదం ఎవరిదో వివరాలు తెలుసుకు రమ్మని పంపింది.

జహాంగీరప్పుడే నిద్రనుంచి లేచాడు. న్యాయగంట గణగణ మ్రోగడంవిని ఆత్రుతతో న్యాయసభకు వచ్చాడు. నూర్జహాన్ కూడా అతని వెంటే సభకు వచ్చింది. జహాంగీరిలా అన్నాడు.

"న్యాయగంట ఎవరు మ్రోగించారు? వారికి జరిగిన అన్యాయమేమిటి?"

ఒక రజకకాంత ముందుకు వచ్చి ఇలా గన్నది. "ప్రభూ గంట నేను మ్రోగించాను. నా భర్తనెవరో బాణంతో కొట్టి చంపారు" అని తన భర్త శవాన్ని చూపించింది.

"బాణం యెటువైపునుంచి వచ్చింది?"

"అంతఃపురం నుంచి"

జహాంగీర్ నూర్జహాన్ వైపు చూచాడు. నూర్జహాన్ తలవంచుకుంది. రాజు చాకలివానికి తగిలిన బాణాన్ని పరీక్షించాడు. దానిపై 'నూర్జహాన్' అను నాలుగక్షరాలు కనుపించాయి. రాజు ఈ విధంగా తీర్పు చెప్పాడు.

"నీభర్తను నూర్జహాన్ చంపి నిన్ను నాథగా చేసింది. కాబట్టి నీవామె భర్తను ఈ బాణంతోనే చంపి ఆమెను అనాథగా చేయుము"

ఒక ధనస్సును తెప్పించి ఆమె చేతికిచ్చాడు. అప్పుడామె ఇలా అన్నది.

"ప్రభూ! లోకాని కాధారమైన మిమ్మల్ని చంపడం తెలివితక్కువతనం. మిమ్మల్ని చంపుతే ప్రజలకెంతో హాని కలుగుతుంది. రాణి తెలియక వేసిన బాణం వలన నా భర్త చనిపోయాడు. చచ్చినవాడెలాగు బ్రతుకడు. వానికోసము మరొకని ప్రాణం తీయుడమెందుకు. నేను మిమ్మల్ని చంపలేను. నన్ను క్షమించండి"

రాజు ఆమెమాటలకు సంతోషించి ఆమెకు కొంత భరణ మేర్పాటు చేసాడు.

—o—

# సాహసవీరులు

## శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

మృణాళినీ నగరాన్ని క్షేమేంద్రుడను రాజు పరిపాలించుచుండెను. ఆయనభార్య సుగుణ, పేరుకు తగిన నడవడికగలది. భర్తనే ప్రత్యక్షదైవంగా భావించి ఆయనకు సేవలుచేస్తూ జీవితం ధన్యంచేసుకొనేది. మహారాజుకూడా భార్య అనురాగాన్నిచూసి ఎంతగానో పొంగిపోయేవాడు. క్షేమేంద్రుడు ప్రజల కష్టాలను తన కష్టాలుగా ఎంచుకొని, వారికే కష్టం కలగకుండా జనరంజకంగా పాలించేవాడు. ప్రజలు తనను ఎంతమెచ్చుకుంటేనేం; భార్య తనయెడల ఎంత అనురాగం చూపితేనేం; మహారాజుకు మనశ్శాంతి అనేదిలేకుండాపోయింది. సుగుణకు ఏటా కానుపే. ప్రతీసారీ మొగబిడ్డకలిగేవాడు. అయితేనేం? ఒక్కబిడ్డకూడా బ్రతకలేదు. రాజుకు పట్టుకున్న విచారమల్లాయిదే. తనకు వంశాంకురం లేకపోతే తన అనంతరం ఈరాజ్యం దాయాదుల పాలయిపోతుందేనని ఆయన విచారం. మహారాజే ఇంతవిచారంగా వున్నపుడు కడుపుకోతకు మహారాణీ ఎంతటి దుఃఖంతో కుమిలిపోయేదో వేరే చెప్పనవసరంలేదు.

ఇలా వుండగా ఒకసారి 'సత్యమహర్షి' ఆరాజధానీ నగరంలోకి అడుగుబెట్టటం జరిగింది. మహర్షి సరాసరి రాజమందిరంలోకి వచ్చాడు. రాజదంపతులు మహర్షిని అనేకవిధాలుగా పూజించి పరితృప్తులనుచేశారు. మహర్షి కొంతసేపు వారి ముఖములవైపు పరికించిచూసి – "చంద్రకళా కోమలములై ప్రకాశింపవలసిన మీ వదనములు యిలా ముకుళించుకుపోయిన వేమి?" అని అడిగేడు.

అందుపై వారు "మహాత్మా! మాకు ప్రతి సంవత్సరమూ బిడ్డలు కలుగుచున్నారు. కాని పుట్టిన పదవరోజునే చనిపోవుచున్నారు. మేమేం పాపం చేశామని మాకిలా సంతానక్షయం కలుగుతుంది. మహాత్ములు! మీకు తెలియందిలేదు. కరుణించి మా సంతాన క్షయాన్ని అరికట్టి మాకువంశాంకురం

నిలిచేట్లు అనుగ్రహించవలసింది!" అని వేడుకున్నారు.

వారిమాటలువిని మహర్షి కొంతసేపు ఆలోచించి — "మీరు పూర్వజన్మలో చేసుకున్న పాపమే యీజన్మలో కూడా శత్రువై మిమ్ము వెంటాడుతూంది. నేను చెప్పినప్రకారం చేయండి. ఈరోజు మొదలుగా మీరిద్దరూ ఒకపూట ఉపవాసముండి పార్వతీ పరమేశ్వరులను అర్చించండి. విరివిగా పేదప్రజానీకానికి అన్నదానంచేయండి. ఇలాచేయటంవల్ల మీ పూర్వజన్మపాపం తొలగిపోయి కడుపుపండుతుంది." అని చెప్పి వారిని ఆశీర్వదించి వెళ్లిపోయాడు.

క్షేమేంద్రుడు మహర్షి చెప్పినప్రకారం భార్యతో ఉపవాసాలుండి పార్వతీ పరమేశ్వరులను పూజింపసాగాడు. విరివిగా అన్నదానాలు ప్రారంభించాడు. ఇలాచేస్తూ క్షేమేంద్రుడు కొన్నినెలల పర్యంతం గడిపాడు. కాని వీటివల్లనే కొంచెమైన ఫలితం కూడా కనిపించలేదు సరికదా క్రమంగా బొక్కసం ఖాళీకాజొచ్చింది. ఇంకొక విశేషమేమిటంటే ఈ అన్నదాన విషయం దావానలా ప్రాకిపోయింది. ఇంకేముంది? ఇతర దేశాలనుండికూడా విరివిగా బిచ్చగాళ్లు రా నారంభించారు. పట్టణమంతా బిచ్చగాళ్ళ మయమైపోయింది. పైగా యీసలహా ఇచ్చిన మునికూడా ఐపులేడు. రాజుకు పిచ్చెత్తినట్లయింది. ఇదంతా చెప్పినవాడు పట్టిదొంగ ముని అనే అపోహ కలిగింది. అపోహ కలిగిమాత్రం చేయగలిగిందేముంది? మహారాజు హృదయంలో నాస్తికత విశేషంగాప్రాకింది. దానితో తాను పూజపునస్కారాలు మానివేయటమేకాకుండా నగరంలో ఈరోజునుండి ఎవరైనా దైవార్చన చేసినట్లయిన నూరు కొరడాదెబ్బలు కొట్టటమే కాకుండా నూరురోజులు కఠినజైలు శిక్ష విధింపబడుతుంది అని చాటింపింపచేశాడు. ఈరాజశాసనంవిని ప్రతి ఒక్కడూ హడలిపోయాడు. అన్నదానాలు మానివేయగానే బిచ్చగాళ్ళందరూ నెమ్మదిగా దూసుకున్నారు. రాజు ఇంత నిరంకుశుడుగా మారిపోయేసరికి ప్రజలలో ద్వేషం అసహ్యతా ప్రబలింది. దైవంమీద కత్తికట్టటం ప్రమాదంఅని సుగుణ హెచ్చరించింది. శాసనాన్ని వుపసంహరించుకొమ్మని బ్రతిమాలింది. కాని మహారాజు తన నిరకుంశత్వాన్ని వుపసంహరించుకోలేదు.

ఇంకేముంది? ఆరోజు మొదలుకొని ప్రజలు దైవదర్శనమే మానుకున్నారు. ఎవరైనా మూర్ఖించి పూజకోసం బయలుదేరితే రాజశాసనం ప్రకారం శిక్షవిధింపబడేది. ఈవిధంగా ఆయన నిరంకుశత్వానికి ప్రజలు అల్లాడిపోయేవారు. దేవాలయాలన్నీ పూజాపునస్కారం లేకుండా మూతపడిపోయినయ్.

ఇది యిలావుండగా ఆ పట్టణంలో యశోధరుడనే బీదబ్రాహ్మణుడుండేవాడు. అతనిభార్య శీలవతి. వారికి లేకలేక కొడుకుకలిగాడు. కొడుకును అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారు. కాని ఇంతలో ఆ బాలుడికి జ్వరంతగిలింది. ఎంతమంది వైద్యులు చూచినా జ్వరం నయంకాలేదు సరికదా తీవ్రంగా పరిణమించసాగింది. ఆరాత్రి శివుడు వారికి కలలో కనపడి తనను అర్చించి ఆ తీర్థమును బాలుని నోటియందుపోసిన బ్రతుకును అనిచెప్పి మాయమయ్యాడు. ఉలిక్కిపడి లేచిచూస్తే ఏముంది! అంతా నిర్మానుష్యంగావుంది. సాక్షాత్తు ఈశ్వరుడే కలలో కనపడి చెప్పినందుకు వారెంతో సంతోషంలో పొంగిపోయారు. ఆ సంతోషంలో రాజశాసనాన్నికూడా లెక్కబెట్టక పూజాద్రవ్యములను తీసుకుని శివాలయమునకు వచ్చారు. అర్ధరాత్రి సమయం కావటంవల్ల నిర్మానుష్యంగావుంది. దేవాలయందగ్గర కాపలాపడుకున్న భటులుకూడా నిద్రపోయారు. ఇదేసమయంకదా అనియశోధరుడు నెమ్మదిగా భటునిబొడ్లోనుంచి తాళంచెవుల గుత్తి లాగి తలుపులు తెరిచాడు. పార్వతీ పరమేశ్వరులను హృదయపూర్వకంగా అర్చించి, అలవాటు ప్రకారం గంట గణగణ వాయించాడు. ఈ శబ్దానికి భటులు వులికిపడిలేచారు. లోపల యశోధరుడు పూజ చేస్తుండటం గమనించి గబగబా లోపలకుపోయి యశోధరుని ఆయన భార్యను బయటకు లాక్కొచ్చారు. "ఎంతపని చేశావురా! దొంగబాపడా! మాకన్న మలగంగానేమాని శివాలయంలోకిదూరి పూజ ప్రారంభించావా! పద! రాజుగారిదగ్గరకు" అని పెటరెక్కలు విరిచికట్టి రాజమందిరానికి లాక్కెళ్లారు.

(సశేషము)



### స్వస్తిశ్రీవారి 'రేచుక్క పగటిచుక్క'

'రేచుక్క పగటిచుక్క' చిత్రము యావదాంధ్రదేశములో ప్రదర్శించబడుతూంది. ఇందులో యన్. టి. రామారావు, యస్. వి. రంగారావు, రేలంగి, అర్. నాగేశ్వరరావు, సి. యస్. ఆర్., నాగయ్య, పేకేటి, జానకి, కన్నాంబ, గిరిజ మొదలగువారు నటించారు. దర్శకత్వము శ్రీ కే. కామేశ్వరరావు, నిర్మాత శ్రీ ఆనందమూర్తి త్రివిక్రమరావు.

కథ ఉత్సాహ ఉత్తేజములతో ఆసక్తికంగా లేనీ ఉత్తమమైనదయినా యీ చిత్రములోని దాస్సులు కథా గమనాన్ని కుంటుబరచినవి. బ్రహ్మాండమైన సెట్టింగులలో ఆకర్షణీయంగా తయారుచేయాలనే దర్శకనిర్మాతల ఆసక్తికనుపిస్తున్నా పేర్కొనతగిన గొప్పతనం ఏమిలేకుండాపోయింది. రేచుక్క, పగటిచుక్కలుగా రంగారావు, రామారావుగారలు సమర్థంగా నటించారు. సుమతి భూమికను కన్నాంబ చక్కగా ఒప్పించింది. రేలంగి హాస్యనటన బాగున్నది. సి. యస్. ఆర్. వీరరాఘవరాజుగా సహజమైన ధోరణిలో చాకచక్యంగా నటించాడు. జానకి, గిరిజ బాగానే నటించారు.

ఇందులోని కొన్ని సన్నివేశాలు, సందర్భాలు అనవసరంగా కనుపించినవి. సంగీతము సాధారణముగా నున్నది. ఈచిత్రము సాంకేతికంగా ఉత్తమ స్థాయినందుకున్నది.

అన్యాయము, అక్రమము తాత్కాలిక విజయాలను సాధించిపెట్టిన, న్యాయం, ధర్మము అంతిమ విజయానికి కారణము కాగలవనే విషయాన్నిప్రబోధించేదగుటచే వినోదంతోబాటు నైతికపురోభివృద్ధిని ప్రోత్సహించగలదు.

చిత్రము మొదటి సగముకంటె రెండవ సగము బాగా రక్తికట్టింది.

### నవశక్తి ఫిలింస్‌వారి 'మాయింటి మహాలక్ష్మి'

నవశక్తి ఫిలింస్‌వారు 'మాయింటి మహాలక్ష్మి' చిత్రమును సర్వాంగసుందరముగా నిర్మించి విడుదల చేశారు.

వయసుమీరి మగవారు పెండ్లిచేసుకుంటే ఎదుర్కొనే సమస్యలు, అట్టి వివాహాలవల్ల కుటుంబాలలోని వ్యక్తుల మనస్తత్వాలు, అపోహాలు, సవతితల్లిగా స్త్రీ ఎదుర్కొనే క్లిష్టసమస్యలు, పరిణామాలు యీచిత్రంలో బహుచక్కగా రూపొందించారు. కథ చాలపొందికగానుండి గమనము సాఫీగానుండింది.

ఇందులోని సంగీతము మనోజ్ఞంగా నుండింది. నృత్య సన్నివేశాలు చిత్రానికి రాణింపునిచ్చినవి.

నటీనటులు చక్కగా నటించారు. మాటలు, పాటలు సందర్భోచితంగాను, సొంపుగాను సమకూరినవి. కుమారి జమున నటన పేర్కొనతగినదిగానున్నది.

ఇందులో బాల్యములోనే భర్తను కోల్పోయిన మగువ మనస్తత్వము, దాని ననుసరించిన పరిణామము నైతికబద్ధంగా సుమంగళిగా చేయడం ప్రజాజీవితంలో మార్గదర్శకం కావచ్చు.

తన లోటును గుర్తించకుండా ఆధారంలేని అనుమానాలతో తొందరపడడంవల్ల ఏర్పడే పరిణామాలు సయితం ప్రేక్షకులలో ఆసక్తిని కలిగిస్తవి.

ఈచిత్రం విజ్ఞానవినోదాలను కలుగజేయునది మాత్రమేకాక సాంకేతికంగా సయితం ఉత్తమ స్థాయినందుకున్నది. ఈ సందర్భమున నిర్మాతలు, దర్శకుడు శ్రీ రామినీడు అభినందనీయులు.

ప్రజల విశేష ఆదరాభిమానములకు యీ చిత్రము పాత్రము కాగలదని గంటాపదంగా చెప్పవచ్చును.

—సి. సి. పున్నయ్య




**అభినవాంధ్ర కాదంబరి: విద్వత్కవిభూషణ... విద్వాన్ వేదము వేంకటకృష్ణ శర్మగారు, ఉదయరంజని పబ్లిషర్స్, 60 సామిపిళ్లెస్ట్రీటు, చూళె, మద్రాసు7. వెల రు. 1-50.**

ఇది ధుండిరాజకవి రచించిన 'అభినవ కాదంబరి' సంస్కృత మూలమునకు ఆంధ్రానువాదము ఇంతకుముందీ గద్యకావ్యము తెలుగులోనికి అనేకులు అనువదించిరి, ఈ 'అభినవాంధ్ర కాదంబరి' బహు చక్కని సరళిలో యింపైన కవితగా రూపొందినది. మూలకవి హృదయమును ఆవిష్కరించుటలో కవి తమ పాండిత్య, కవితా ప్రజ్ఞావిశేషములను ప్రదర్శించిరని చెప్పవలెను. కళాశాల విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నెన్నుకోతగినది,

**లక్ష్మీ సరస్వతుల 'వాగ్వాదము' శ్రీ శిల్లా ఖడ్గ నారాయణరెడ్డి, ప్రాప్తిస్థానము: శ్రీ శిల్లా రాజులు రెడ్డి సోదరులు, కళింగపట్నం, శ్రీకాకుళంజిల్లా.**

ధనమును లక్ష్మీదేవిగాను, విద్యను సరస్వతీదేవిగాను పోల్చి, లక్ష్మీసరస్వతులలో సరస్వతీ కటాక్షము ఉత్తమమైనదను నమ్మకముతోను కవి పద్యములుగా రచించి పొందుపరచిన పుస్తకము. అభ్యుదయ కవి యగుటచే యిందులో ఛందోవ్యాకరణ దోషములున్నను భవిష్యత్తులో సవరించుకొని పరిశ్రమతో కూడిన కృషితో ఉత్తమ కవితలల్లగలడని ఆశిస్తున్నాము.

**వరకట్నాలు ఎందుకు నిషేధించాలి?: శ్రీ తలగడదీవి శ్రీరామారావు. ప్రచురణ కర్తలు స్నేహలతా వరకట్ననిషేధ సంఘం, గాంధీనగరం, విజయవాడ 2.**

వరకట్నాలను నిషేధించాలి అనే విషయమును సూక్ష్మంలో మోక్షంలాగ సహేతుకంగా సమగ్రంగా చర్చించి కలిమిలేముల కతీతంగా అందరు వరకట్నాలను యిచ్చిపుచ్చుకోడాలను మానాలని రచయిత ప్రబోధించాడు. వరకట్నాలకు ఆరాటపడే వ్యక్తులు ఆత్మపరిశీలన చేసికొని విజ్ఞతతో సంఘపురోభివృద్ధికి తోడ్పడి స్వీయపురోభివృద్ధిని రూపొందించుకోడానికి యీ పుస్తకం తోడ్పడుతుంది.

**వరకట్నాలు నిషేధించండి: శ్రీ ప్రభాకర శ్రీకృష్ణభగవాన్, ప్రచురణకర్తలు: స్నేహలతా వరకట్న నిషేధసంఘము, గాంధీనగరం, విజయవాడ 2.**

ఇందులో ప్రజలకు వరకట్నములు యిచ్చి పుచ్చుకోడమును గురించి కలిగే సందేహాలకు సమాధానమిస్తూ వరకట్న నిషేధయుద్యమ విస్తరణ ఆవశ్యకత వివరించబడింది. సాంఘిక అభ్యుదయ కార్యక్రమమున కుద్దేశించిన యీ సాహిత్యము ప్రజలు స్వీయ సుఖ సౌభాగ్యములకు వినియోగించుకుంటారని ఆశిస్తున్నాము.

---

**శ్రీ వెంకటేశ్వరాంధ్ర సుప్రభాతము: శ్రీ నేమాన వేంకట కోటేశ్వరశర్మ. ప్రకటనకర్త: శ్రీ ఆకుండి వేంకటేశ్వరశాస్త్రి, శ్రీ వేంకటేశ్వర తెలుగు షార్టుహాండ్ టైపు రైటింగ్ ఇన్‌స్టిట్యూటు తణుకు, ప. గోదావరిజిల్లా.**

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతగీతము మూలము శ్రీ కాంచీపుర నివాసియగు శ్రీ ప్రతివాదభయంకరాణ్ణన్నాచార్యులు రచించిన సంస్కృత శ్లోకములు. ఇవి ప్రత్యక్ష దైవమగు తిరుపతి వేంకటేశ్వరుని మేలుకొలుపుకై యుద్దేశించబడినవి. శ్రీ వేంకట కోటేశ్వరశర్మగారు మూలములోని ఒక్కొక్క శ్లోకమునకొక్కొక్క కందముగ నిరువది పద్యములను రచించినారు. చాలవరకు మూలానుసరణముగా భావముల పొందిక, దేశీయత, సౌలభ్యములు ఉట్టిపడుతూ రూపొందిన యిందలి పద్యములు పండిత పామరులు పఠించి శ్రీ వెంకటేశ్వరస్వామిని కీర్తించి, స్మరించి ధన్యులగుటకు తోడ్పడును.

**భగవాన్ శివానంద (రెండవ సంపుటి): శ్రీ గోవిందరాజు, సత్యనారాయణ, దివ్యజీవన సంఘ అధ్యక్షుడు, రైలుపేట, గుంటూరు వెల రు. 1/-**

ఇందులో శ్రీస్వామిశివానంద భగవానులు స్వయముగా ముక్తిమార్గములగు ధ్యానము, స్తోత్రములాంటి అమూల్య విషయములతో బాటు యిహంలో సుఖసౌభాగ్యముల సమకూర్చు మంత్రములను, వాని జపవిధానములను వివరించినారు. ఇందులో భగవానుల దివ్యసందేశమును, ఆనందగీత సయితము పొందుపరచబడినవి. ఇది అమూల్యమైన గ్రంథము. భక్తి విశ్వాసములతో ఆత్మపరమాత్మ విచారములపట్ల ఆసక్తిగలవారికి యీ గ్రంథము విశేషముగా తోడ్పడగలదు.

**భక్తిగీతములు: శ్రీమతి యర్రగుంట్ల సీతాలక్ష్మమ్మ, C/o శ్రీ వై. సుబ్రహ్మణ్యాం 2/123 రెండవరోడ్డు, జార్జిపేట, అనంతపురం. వెల 50 నయాపైసాలు.**

ఇందలి పాటలు భగవన్నామ సంకీర్తనమున కుద్దేశించినవైనా అధునిక పాటల వరుసలలో ఆకర్షణీయంగాను, ప్రతియొక్కరు పాడుట కనువుగానున్నవి. చక్కని సాహిత్యము. ప్రజలలో విశేషముగా ప్రచారమునకు రాగల పుస్తకము.

---

పొన్నలూరి బ్రదర్స్‌వారి జానపద చిత్రం 'దైవబలం' జూలై మాసంలో విడుదలకు సిద్ధముగానున్నది. ఇది సగానికిపైగా కలరుచిత్రం. ఇందులో యన్. టి. రామారావు, జయశ్రీ, గుమ్మడి, రేలంగి, రమణారెడ్డి, మాలతి, బాలాకుమారి మొదలగువారు నటించారు. కథ పొన్నలూరి బ్రదర్స్‌వారి స్వంతం. పాటలను సముద్రాల, అనిసెట్టి, కొసరాజుగారలు వ్రాసారు. సంగీతం అశ్వద్ధామ. దర్శకత్వము శ్రీ వసంతకుమార రెడ్డి.

---

నార్తు మద్రాసు ఆర్ట్సు అకాడెమివారి అధ్వర్యమున భారతీయ నాట్యమండలివారు 17-5-59 న రాజా అణ్ణామలైహాలులో "వరవిక్రయం" నాటకమును ప్రదర్శించారు. శ్రీ అయ్యాగారి విశ్వేశ్వరరావుగారి పాటలు, మాటలు యీ నాటకమును రాణింపజేసినవి. మార్కండేయశర్మ, యం. రామనాధశాస్త్రి, వంగర, సుబ్బులు, యం. ఆర్. తిలక్, శ్రీమతి తిలకం, కుమారి రాధారాణి మొదలగువారలు నటించారు. నటీనటుల అనుభవప్రజ్ఞా విశేషములు నాటక ప్రదర్శనమును జయప్రదంచేసినవి. కుమారి రాధారాణి వేషం, పోకడలు పాత్రోచితంగానున్నట్లయితే బాగుండేడిది.

అధ్యక్షతవహించిన శ్రీ జే. వి. సోమయాజులు, ఉపన్యసించిన శ్రీ ఆమంచర్ల రాజగోపాలరావు నటీనటుల నభినందించి ప్రశంసిస్తూ పూలమాలలు వేసిరి.

శ్రీ యం. ఆర్. తిలక్‌గారికి నాటకకళపట్లగల ఆసక్తి అభిమానములు భారతీయ నాట్యకళామండలి అభివృద్ధిని ప్రోత్సహించి, మద్రాసులో ఆదర్శనీయమైన కళా కేంద్రముగా రూపొందగలదని ఆశిస్తున్నాము.

ఆర్. సుబ్బరామశాస్త్రి

# సంపాదకీయములు

## ప్రణాళికల సాఫల్యానికి మార్గం

ప్రణాళికల సాఫల్యానికి ఆర్థికవసతులతోబాటు ప్రజాసహాయ సహకారములు అత్యవసరము. ఇందుకుగాను స్థానిక స్వచ్ఛంద సేవాసంస్థలను బలపరచడం అవసరమనే సూచన గమనించతగినదైనా ప్రజాసామాన్య సాధకబాధకాలు, స్థితిగతులను ఎప్పటికప్పుడు పారచూడవలసియున్నది.

ప్రజాసహాయ సహకారములు లభ్యము కావాలంటే అమలులోనున్న ప్రణాళికలు తమ స్వీయ పురోభివృద్ధికి తోడ్పడగలవనే నమ్మకం ప్రజలకేర్పడాలి. ప్రజలయొక్క బరువు భారాలు, ఉన్న అవకాశములు గుర్తించబడి వారి కసంతృప్తికలుగకుండా సహాయ సహకారములు సేకరించబడాలి. ప్రజలు, ప్రభుత్వము ఒకటనేభావం ఏర్పడి పరస్పర సానుభూతి సద్భావములు పెంపొందుటవల్లనే ప్రణాళికలు పూర్తిగా సాఫల్యము పొందగలవు.

## గ్రామంమధ్యలో హరిజనులకు యిళ్లు

హరిజనుల పురోభివృద్ధి ననుసరించి అమలుజరుగుతున్న సంక్షేమ కార్యకలాపాలవల్లనైతే నేమి, ప్రజలలో మానసిక పరివర్తనద్వారానైతే నేమి వారికి అందరికంటె మిన్నగానో, సరిసమానంగానో అవకాశాలతో జీవయాత్రకు అవకాశాలు ఏర్పడినవి. శుచి, శుభ్రతలతో నాగరికంగా జీవయాత్రచేస్తున్న హరిజనులకు సంఘంలో మునుపటి అవరోధాలు ఏరంగంలోనులేవు. పద్ధతులు మార్చుకోకుండా, అమరిన అవకాశములను వినియోగించుకొని నాగరిక జీవితమున కలవాటు పడనివారు తదితర ప్రజల సరసన సమానావకాశములను, హక్కులను కోరడం సముచితముకాదు. గ్రామాలలోను, పట్టణములలోను మెరుగైన జీవితమున కలవాటుపడి హరిజనులనేకులు ప్రజలమధ్య జీవితము గడుపుతున్నారు.

## నైతిక విలువల ఉద్ధరణ

లోక్‌సభ సభాపతి శ్రీ యం. అనంతశయనం అయ్యంగార్ హైదరాబాద్‌లో కస్తూర్బా విద్యాలయంలో వీడ్కోలు ప్రసంగంయిస్తూ ప్రాచీన ప్రాచ్యనైతిక విలువల పునరుద్ధరణ జరిగితేతప్ప భారతదేశం వ్యక్తిత్వంపొంది పురోభివృద్ధిగాంచ జాలదని చెప్పారు.

శ్రీ అయ్యంగారు చెప్పినట్లు ప్రస్తుతము మనదేశంలో జీవనసరళి పాశ్చాత్యభౌతిక వాదమయమై యున్నది. అంటే ప్రజలు నైతిక విలువలపట్ల నిర్లక్ష్యం చూపుతున్నారు. దాని ఫలితంగా మానసికంగా, శారీరకంగా దిగజారడమేకాక నిజమైన సుఖసౌభాగ్యములకు, శాంతిభద్రతలకు దూరమగుచున్నారు.

మానవజీవయాత్ర సుగమమై సుఖసౌభాగ్యములతో యిహపరాలలో రాణించాలంటే నైతిక విలువలు పునరుద్ధరణ జరిగితీరాలి. దానికని ప్రతియొక్కరు ఆసక్తితో కృషిసాగించడం దేశానికి, ప్రపంచానికికూడ క్షేమకరం.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Ag. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.